# సాహితీ విపంచిక



రచన :

**యమ్. ఆర్. అప్పారావు,** యమ్.ఏ.,
యమ్.యల్.ఏ.

ఉపాధ్యక్షులు, ఆంధ్ర విశ్వవిద్యాలయం



ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు

వాల్తేరు, విశాఖపట్టణం 530 003

# విషయసూచిక


| | | |
|---|---|---|
| | పీఠిక ... ... ... ... ... | v |
| 1. | రుబాయ్యాత్ ... ... ... .. | 1 |
| 2. | గ్రీకు రూపకములు ... .. ... | 29 |
| 3. | బ్రహ్మర్షి వేంకటరత్నంనాయుడు ... ... | 53 |
| 4. | సంస్కృతి ... ... ... ... | 97 |
| 5. | ఆంధ్రజాతి సంస్కృతి చరిత్ర ... ... | 109 |

# పీఠిక

నేను అప్పుడప్పుడు రచించి ప్రచురించిన నాలుగు తెలుగు గ్రంథాలను అవలోకించిన సాహిత్యమిత్రులు కొందరు వానిని విడి విడిగా ఉంచడంకంటె ఏకసంపుటంగా కూరుస్తే బాగుంటుందని సూచించారు. అది ఒప్పిదమైన సూచనగా భావించి ఇప్పుడు ఇట్లు ఒక సంపుటంగా ప్రచురించి తెనుగులోకానికి సమర్పించుకొంటు న్నాను.

ఈ సంకలనంలో తొలుతటి దాని శీర్షిక రుబాయ్యాత్. ఇది పద్యకృతి. 'గియాసుద్దీన్ అబుల్ ఫతహ్ ఉమ్రుబిన్ ఇబ్రహిమ్' అనే పూర్తిపేరు కలిగి 'ఉమర్ ఖయ్యాం' అనే సంగ్రహ నామంతో విశ్వవిఖ్యాతుడైన పారశీక కవి రచనకు ఇది తెలుగుసేత. పన్నెం డవ శతాబ్దికి చెందిన ఈ కావ్యాన్ని పందొమ్మిదో శతాబ్దిలో 'ఫిడ్జి రాల్డు' అనే ఆసామీ ఆంగ్లంలోనికి అనువదించాడు. ఆ ఆంగ్లాను వాదం ప్రపంచ ప్రఖ్యాతినంది మూలకావ్యకర్త తత్వవిచారము ప్రపంచంలోని ప్రశస్త సాహిత్యాల పరామర్శ అందింది. మూలంలో ఇది రుబాయి ఛందోబద్ధము. అందుచేత ఈ రచన 'రుబాయ్యాత్' పేరిట వెలసింది. తత్వవిచారంచేస్తూ వార్త (message) ను అం దించే ఈ కృతిని భారతీయ సంప్రదాయానికి అనువుపరచి సంగ్ర హించితిని. ఇందలి తత్వబోధ అంతా పానపాత్ర అవలంబనంతో సాగింది. 'ఆసవపాత్ర తీయని లోతులలోనే ప్రాత విచారమ్ములు అణిగిపోతాయని', 'నిర్మలాసవ పీయూష మకరందములో తన్మయ త్వము కనవచ్చుననీ' కవి అంటూ ఉన్నప్పుడు, అందలి వ్యంగ్య వాసనావిలాసనము రసజ్ఞులకు అత్యంతామోదాన్ని కలిగిస్తుంది. ఉపాదేయమైన నీతిని బోధించే ఈ ప్రశస్త కావ్యాన్ని తెలుగులోనికి

అనువదించుటలో నేను ఎంతవఱకు కృతకృత్యుడనైనానో విమ ర్శకులు తేల్చవలసిన విషయం.

ఈ సంకలనంలోని మిగతా మూడు గ్రంథాలు వచన రచనలే. ఈ మూడింటిలో ఒకటి 'గ్రీకు రూపకములు' అనేది. ఇది సారస్వత విషయికమైన గ్రంథం. గ్రీకు నాటకాల పుట్టుపూర్వోత్తరాలు, క్రమ వికాసాలు ఇందు వివరించాను – క్రొత్తవానిని మానవుడు సంకోచం లేకుండా స్వీకరించడు. మనదేశంలో బ్రిటిషువారు ముందు పోస్టు కవర్లు ప్రవేశపెట్టారు. దరిమిలా కార్డులు వచ్చాయి. ప్రజల రహ స్యాలను తెలుసుకోవటానికి వానిని ప్రవేశపెట్టారనే ఆందోళన లేచింది. ఈనాడు ఈ ఆందోళన సమాచారం మనకు హాస్యాస్ప దంగా తోచకమానదు. గ్రీకునాటకాలు పుట్టినరోజుల్లో ఇట్టి వింత సంఘటన ఒకటి వినవస్తూ ఉంది. క్రీ.పూ. 639-559 ప్రాంతంలో ఏతెన్సు నగరపరిపాలకుడైన సోలెన్, 'తెస్పిస్' నాటకం చూడటానికి వెళ్ళాడట. అంతకుముందు నాటక మంటే నాట్యంచేసి పాటలు పాడటం మాత్రమే. 'తెస్పిస్' వేషధారణం కొత్తగా ప్రవేశపెట్టాడు. ఈ నూతనవిధానాన్ని చూసి 'సోలెన్' 'ఈ విధంగా మాయనటన చేసి ప్రజలయెదుట అబద్ధమాడటానికి సిగ్గులేదా ?' అని గద్దించి అడి గాడట. దీనికి సమాధానంగా తెస్పిస్ 'నాటకంలో వినోదాని కాడితే ప్రమాదం ఏముంది ?' అని సమాధానం చెప్పాడట, వెంటనే సోలెన్ తన చేతికర్రతో నేలమీద కొట్టి 'మనమీ నటనను మెచ్చి గౌరవించినట్లయితే యిటువంటి నటనే ప్రజావ్యవహారాల్లో ప్రవే శించగలదు' అని కోపంతో అన్నాడట. 'కావ్యేషు నాటకం రమ్యమ్' అని గొప్పగా చెప్పుకొనే ఈనాటి నాగరికులకు గ్రీకు నాటకపు పురిటి రోజులనాటి ఈ కథ ముచ్చట గొల్పక మానదు.

ఇందలి మూడో గ్రంథం శీర్షిక 'బ్రహ్మర్షి వేంకటరత్నం నాయుడు.' శ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు ఒకవిధంగా మా కృష్ణాజిల్లాకు చెందినవారు. వారు కాకినాడ కాలేజీ ప్రిన్సి

పాల్‌గా, మద్రాసు యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్‌గా విద్యారంగానికి చేసిన సేవ మరువరానిది. వారి సంఘసేవ సాటిలేనిది. ఈ గ్రంథంలో నాయుడుగారి జీవితచరిత్ర సంగ్రహంగా కథించడమే కాక వారి జీవితం యొక్క పరమార్థాన్ని ప్రస్తరించడానికి ప్రయత్నించాను. ఇది 1962 అక్టోబరు 27 వ తేదీని కాకినాడలో బ్రహ్మర్షి వేంకటరత్నంనాయుడి గారి శతజయంత్యుత్సవ సభలో నేను చేసిన ప్రసంగానికి గ్రంథరూపం. ఈ ఇరవయ్యో శతాబ్ది పూర్వార్ధంలో ఆంధ్రదేశాన్ని ఓపినకొలది అభ్యుద్ధరించిన మహాభాగులలో వారొకరు. వారు మనకు స్మరణీయులు. శ్రీ నాయుడు గారి బోధనలను ప్రార్థనలను శ్రద్ధతో అధ్యయనం చేయడంవల్లనే నేను అపారమైన ప్రయోజనం పొందాను. పొందిన ప్రయోజనానికి ఉచితోపయోగ్యవృత్తి కల్పించుకోవడానికై వారి కీర్తిని ఈ చిన్న గ్రంథంలో స్మరించి తృప్తిని పొందుతున్నాను.

ఇక నాల్గో గ్రంథం: ఆంధ్ర సంస్కృతిని గురించినది. ఈ గ్రంథంలో ముందుగా సంస్కృతి అంటే ఏమిటో అనేక దృక్పథాల నుండి వివరించాను. ఆమీద ఆంధ్ర సంస్కృతిని గురించి ఇరవైకి పైగా శీర్షికల క్రింద సంగ్రహంగా క్రోడీకరించాను. సంస్కృతికి మూలస్తంభం భాష. మన ఆంధ్రభాష మధుర మంజులమైనది. సంగీతానికి అనువైనది. 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అని పాశ్చాత్యులు లోగడ దానిని ప్రశంసించి ఉన్నారు. ఇటీవల మరియొక పాశ్చాత్యపండితుడు, హాల్డేన్, మన భాష ఆధునిక వైజ్ఞానిక భావాలను వ్యక్తం చేయడానికి భారతీయ భాష లన్నిటిలోనికి అనుకూలమైన దని అన్నాడు. అట్టి భాష అవలంబన మన సంస్కృతి వివిధరంగాలలో ఎంతటి అభ్యున్నత స్థానాన్ని అందిందో, అందగలదో దిఙ్మాత్రంగా నేను ఇందు క్రోడీకరించాను. అపారము, అగాధము నైన ఆంధ్ర సంస్కృతిని పురశ్చరణ చేయకలిగినందుకు నాకు సంతోషంగా ఉంది.

ఈ గ్రంథంవల్ల తెలుగువారికి నేనేమాత్రమైనా ప్రయోజ నాన్ని సాధింప కలిగితే నా ప్రయత్నం సఫలీకృతమైనట్లే నేను భావిస్తాను.

వాల్తేరు,                                                        మేకా రంగయ్యప్పారావు
ఏప్రిల్ 6, 1977

# రుబాయ్యాత్

లెమ్ము ప్రేయసీ ! బాలభానుడు
　　నీలిగుండంబులో మేలిరత్నము వేసె
తారలబారు హుటాహుటి
　　దౌడుతీసె
చూడు తూర్పువేటగాడు
　　రారాజుమేడ
కాంతిఉచ్చుతో చక్కగ
　　చిక్కబట్టె చూడ

2

ఉషఃకాంతుని వామహస్తమ్ము
　　దిగ్దివినొసట రాజిల్లు వేళకె
పానశాలాంతర్భాగాన తియ్యని
　　కలల యదృశ్యవాణి యిట్లు పలికె:
—"ఓ బాలులార ! నింపు
　　డాసవపాత్ర నింపు డిదె
జీవితంపు మధుపీయూష
　　మ్మది యింకకముందె"—

3

పానశాలాంగణాన పవ్వళించు
　　పాంథులెల్ల లేచిరి
తొలికోడికూతతోనే
　　మేల్కాంచి పిలచిరి
—"తీయుమోయి తలుపు శీఘ్రమ్మె
　　పోవలయు మే మిప్పుడె
మరలిరాబోము రాబోము నీ
　　చాయలకు మే మెప్పుడు"—

4

అంతులేని ఆశాపాశాలు
        ఉగాదియువకుని బాగుగ బంధించు
ఏకాకియౌ హృదయమ్మును
        సంస్మరణాల కెరటాల తేలించు
తెల్లమౌ పుష్పగుచ్ఛమ్ము లీను
        సువాసనావల్లరు లెల్ల
వనదేవి రమ్యకరాలో ఆమె
        సౌరభ్యశ్వాసలౌ యనంగ జెల్లు

5

హస్తినాపుర మయసభ లెల్ల
        కాలగర్భాన గలిసె
రారాజుల అమృతపాత్రలు
        తుత్తునియలై మట్టి నొలసె
కాని యీ యమునాతటాన
        మలయమారుత మెల్లపుడు వీచుచుండు
ద్రాక్ష నిజమధురాసవంపు
        కెంజాయ నెల్లపుడు నొసంగుచుండు

6

ప్రేమగాయక మృదుగానస్వరమ్ము
        మూగవడియె సుమ్ము
"ఆసవ మ్మాసవ" మ్మంచు
        ధ్వనించు పికస్వరమ్ము
సార్వభౌముని అంతఃపురాంతర్గత
        స్నానవాటిక లెల్ల నెండిపోవును
ఈ సెలయేటి సలిలమ్ము లెల్లవేళల
        మిలమిలలాడుచు పారును

7

పిట్టగూటికై యెగుర
సాగింది సాగింది
మఱ్ఱిపూడల నణగి మణగి
గూడుంది గూడుంది
ఎగిరియెగిరి అలసిసొలసి
గూడు చేరింది చేరింది
విసురుమోయి విచారమ్మును శొలువ
వసంత సమీరమ్ములో
విరిగి కరుగు జీవితపరిహాసమ్ము
ఆసవ సుహాసమ్ములో

8

భాస్కరకరాల గిలిగింతల
వేయిసుమాల వెలిమొగ్గలు నవ్వె
మరి వేయి వాడి వమ్మై రాలి
నేలపాలై బువ్వె
గులాబి తెచ్చు నీ నవ
వసంతావతంసమ్ము
రాజుల రాణుల వుసురు
పోసుకొనును సుమ్ము

9

రండు రండు రారండు
మీ ఖయ్యాముతో
విడువుడు మన కేల
కృష్ణార్జునుల దయతో
తన గదతో భీముని
చెండాడ నిండు శత్రుల మూకల
దానకర్ణుని కరుణ
బ్రోవనిండు నిరుపేదల

10

బానిస – రాజను భేదాలె
లేవు లే వచట
సర్వమానవ సమానత్వమ్మే
చెల్లు నచట
"లోకంబుకెల్ల నేనె రారాజు" నంచు
విఱ్ఱవీగు సుయోధనుని వింటివే!
జాలిగొలుపు వాని వెఱ్ఱిచూపుల
దివాంధత్వమ్ము కంటివే!

11

దూరాన నుండేటి సెలయేటి
తీరాన హాలికులు
స్వహస్తాల పరతురు
చక్కని పరుపులు
రారమ్ము రారమ్ము
పోదాము పోదాము
పచ్చనిపంట లందాల
చందాల మించు
ఎండి మండు ఎడారి మత్సరపు
బునలెల్ల నణగించు

12

ఈ చెట్టునీడలో
ఆ ద్రాక్షరసముతో
నాచేతి పండ్లతో
నీగొంతు పాటతో
తీతేనె కావ్యమ్ముతో
వనమెల్ల నందనమె
ఓ ప్రేయసి! ఓ ప్రేయసి!
ఇది స్వర్గమె! యిది స్వర్గమె!

13

రాజ్యపాలనమ్మె
        జీవితాశయ మ్మను కొందరు
రానున్న స్వర్గమ్మె నిజమైన
        పరమార్థ మ్మను మరికొందరు
వాద వివాదాల మధ్య
        వారి నలుగనిండు
వర్తమానమ్ములో
        ఓలలాడుదము రండు
మనకేల భవిష్యద్రాగాల
        నును పెలుపు లెండు

14

వికసించి ప్రకటించు గులాబి
        మృదుసందేశమ్ము వినుడీ !
—"ప్రకృతిలో నిర్విచారాన
        నివసింతుచుండీ !
నా పట్టుసంచుల గట్టి
        త్రాళ్లల్ల తెంపి చిమ్ముదు
సువాసనా ధనమ్మెల్ల
        రంగారు నుద్యానవనమ్ముందు"

15

మానవకోటి పేరాసలు
        వేలాదివేలె యెపుడు
మనసార నవి
        ఫలించు నొకపుడు
పూర్తిగా విఫలమ్ము
        లౌ మరొకపుడు
కొన్ని ఫలించిఫలించక మోద
        ఖేదముల గూర్చు నపుడపుడు
ఇవియెల్ల నెడారి యెండుటిసుకపై
        మంచు ముత్యమ్ములు
థళథళా మెరయు విశీర్ణ కాంతి
        రెండు నిమేషమ్ములు

16

చీమవలె గింజకుగింజ
　　కూడబెట్టిన సెట్టి
తండ్రి యిచ్చినదెల్ల హాయి
　　సెలవుచేసిన జెట్టి
వీరిరువురును పోయి తిరిగి
　　రాబోరు రాబోరు
మంటగలిసిన శవాలు
　　మానవులు కాబోరు కాబోరు

17

ఎరుగుదు రాత్రింబవళ్ళే
　　పెనుద్వారమ్ము లీ సత్రమ్ము కంచు
ఒకరాజు వెంట నిం
　　కొకరాజు పాలించు
గర్వాన "నేనె భూభర్తను
　　నా కెదు రెవ్వ" రంచు
పాప మెరుగ డొకడేని
　　నిడియెల్ల మూన్నాళ్ళముచ్చటంచు

18

సార్వభౌము డేలిన నవరత్నఖచిత
　　శిఖిసింహాసనమ్ముండు చోటెల్ల
చూడు తొండలు త్రవ్వి
　　చల్లగ పెట్లు గుడ్ల నెల్ల
అప్పుడు గజ్జెకట్టి
　　మెప్పించిన వేశ్య లేరి!
వారిచేత ఆసవమ్మానిన
　　రాకుమారు లేరి!
షికారి గోరీపై వన్య
　　మృగమ్మె పవ్వళించు
అతడు పాప మరమరలేక
　　శాశ్వతనిద్ర ననుభవించు

19

రారాజు రక్తపుటెరువున
పెరుగు గులాబి పసందు
మరి యెందు వెదకినా
కానరాదు రాదు
వనదేవివొడి కులుకు
మల్లెపూ పుత్రికలు
ఎప్పు డలంకరించెనో
దివ్యలలామల నీలశిరోజములు

20

మన కాలిక్రింద నలగు
మెత్తని మూలికారాజాలు
సెలయేటి పెదవి నాని
జలజలమని కులుకు జాల
నెమ్మదిగ కాలిడుమా!
ఈ తీగ నిద్రించు నే
మధురాధరామృతము
గ్రోలి జీవించునో

21

ప్రేయసీ! ఓ ప్రేయసీ!
నింపు మానసపాత్రను
దీని తీయని లోతులలోనె
మెల్లన నణగును
ప్రాత విచారమ్ములు,
క్రొత్త యాశల
సాఫల్యా వైఫల్యాల
సందేహమ్ములు
రేపేల రేపేల
రేపునేను గలియుదునుతే
నిన్నటికి గడచిన
యుగయుగాల కాలాలలో

22

వెన్నెలల భూలోకాప్సరసల
గాంచి ముగ్ధులమైతిమి మేము
కాలకర్మములు కటా వారి
యౌవనాసవము గ్రోలుట చూడలేము
వారెల్ల నొండురెండు పాత్రలు
సేవించునంతలో
అకటా కాలక్రమము ముంచినది
సమాధినిద్రలో

23

వదలిచనిరి తాతముత్తాతలందరు
వారి యిండ్లనెల్ల క్రమముగా
మనమందు మత్తెక్కి ఆడుచు
పాడుచున్నాము సుఖముగా
మనముకూడ శ్రమమ్మే వదలుటే
తథ్యమ్ము సుమీ
పెద్దల బూదిపై పుష్పించుపూలె
యీ పాన్పులయ్యె గనుమీ
మన బూదిపై పూలు మన
సంతతికి పాన్పులవు వినుమీ

24

ధాత వ్రాసిన వ్రాత చాల
గడచిపోయెనే
మైమరచు మా నందనోద్యానవన
వసంతవాహినులలో నే
జాలమేల "శుభస్య శీఘ్రమమ్ము"
శీఘ్రమమ్ము శీఘ్రమమ్ము
బూది మట్టి గలసి యెర్రగులాబి
కెరువౌట తథ్యమ్ము తథ్యమ్ము

25

మధురానవ మకరంద సంసేవనా
సుఖము జిహ్వ మరచును
మృదు సంగీతస్వర నినదమ్ముకు
వీనులు చెవుడువడును
అమరగాయక పికస్వరము
మూగవడును
చివరకు తుది మొదల్లేనిదై
సర్వ మనంతాన గలియును

26

జీవితమెల్ల ధారపోసి ఐహికసుఖ
మార్జించిన షాహుకారును జూచి
సర్వము త్యజించి ఆముష్మికమ్మే నమ్మి
కృశించు సన్యాసి గాంచి
అంబరవీథుల నాను చీకటిమేడపై
'మౌజిను' పల్కె పెనుధ్వని
"మీ వెర్రియాశల ఫలిత
మిక్కడ నక్కడ సున్నయే" నని

27

ఇహపర రహస్య విషయచర్చ
వాదోపవాదాల
తర్కించి తర్కించి తుదమొద
ల్లేని వివాదాల
నైజతత్త్వమ్మునే వేదాంతులు
కానరైరి
శుష్కప్రవక్తలకైవడి వారు
త్రోసిరాజులైరి
ఎడతెగని తర్కాల ధ్వనులెల్ల
గాలిలో లీనమయ్యె
వాదించు నోళ్లెల్ల
మట్టిగలసి మాయమయ్యె

28

"జాతస్య మరణం ధ్రువ"
మ్మనుటే సత్యమ్ము
తదన్య మెల్ల వట్టికల్ల
యని నమ్ము
చేయిచేయి పెనవేసి ఖయ్యాముతో
నయ్యాటగారమ్మా !
పుష్పించిన సుమ మ్మదిగో
మొదటనె రాలునుసుమ్మా !

29

చిన్నతనాననే జ్ఞానుల విద్వాంసుల
భక్తి సేవించి కంటి
శబ్దార్థభేదాలు శాస్త్రోపదేశాలు
వీనులనిండ వింటి
విని విని విసిగి విసిగి
వేసారితినే గాని
వాగ్దేవి నైజవిన్యాసాల కన్నార
కాంచ వినుమంతేని

30

జ్ఞానక్షేత్రాల హాలికుల జేరి
నేనును విజ్ఞానబీజపుంజమ్ము
శ్రద్ధగ నీరువోసి పెంచి
పెనుపైరు చేసితిసుమ్ము
పండిన ధాన్యమెల్ల చెరుగగా
మిగిలిన గట్టిగింజ లివి
గంగలా జలజలా వచ్చి తీవు
గాలిలా బుస్సుమంచు పోవుదువు

31

ఇష్టానిష్టాల మాటయే లేదు
యెందు కెక్కడి కను ప్రశ్న అసలె లేదు
ఈ మహాసృష్టి సాగరాన
సెలయేరులా గలియుచున్
వాయుదేవుని వెర్రి
వ్యూహాలులా యెగురుచున్
అటునిటు సృష్టివీథు లెల్ల
కలయ వీచుచున్
సరిహద్దులెల్ల దాటుదు
పోవుచున్ పోవుచున్

32

రోయు చిక్కడి కేల
పరుగిడితినా యను
రొప్పు చెక్కడి కీ వింత
పరుగు సాగు నను
పిచ్చివూహల తెగని
ప్రశ్నల త్వరలో
మరచుమీ ఆసవకన్యకాలలా మ
జోలల హాయిలో

33

ఏడేడు లోకాలు
ఎల్లలెల్లస్ దాటి
తత్వ పరిజ్ఞాన
యంత్రాన వెదకితి
గాలించి గాలించి
విసిగి వేసారితి
నెంతెంతొ వెదకితి
యెన్నెన్నొ నేర్చితి
గడ్డు ము ళ్ళనేకములు నేర్పున
విప్పనేర్చితిగాని
ముళ్ళకెల్ల ముడి ఆ జననమరణాల
ముడి విడబడదాయెనేమి ?

34

పరమరహస్య ప్రాంగణద్వారపు
తాళపుచెవి దొరకలేదు
మాయతెరమాటున దాగిన కన్య
సహజసౌందర్యమ్ము కానరాదు
నీవు నేనను ద్వంద్వాల మాట
యిసుమంత వినిపించు
అంతలో నీవు నేను లే మను
నదియె కనిపించు

35

దిక్కుతోచక దీననై ఆకాశాని
కెలుగెత్తి అరచితి స్వామి!
"చిమ్మచీకట్ల చిత్తవు అనాథలౌ
బిడ్డల గతియేమి!
అదృష్టదేవి కాంతిహస్త మెందును
గానరాదేమి!" యంచు
జవాబిచ్చె నాకాశవాణి
"గుడ్డినమ్మకమ్మె గతి" యంచు

36

అంత మట్టిముద్దపై కాలిడి
మజిలీ సాగించితి
జీవితరహస్య పానీయాల
క్రుంకు లిడ దలంచితి
నేనేర్చిన విద్యయిది "రెప్పపా
టీ జీవితమ్ము
ఈ త్రుటిలోనె ఆనుమా
అనుభవామృతమ్ము
నిశ్శరీరయైన ఆత్మ
కందరాని ఫలాలు
ఈ నవనవోన్మేష
విషయవాంఛా విశేషాలు"

37

"ఛట్ ఛట్" మను
ఈ మట్టిపాత్రము
దీని మూగగాత్రము వచించె
మంచిసూత్రము
"నేను నీవలె జీవించి కన్యకాధరముల
ఆసవరుచుల చవిచూచి తపుడు
నేర్చితి విషయవాంఛల అంచనైన
అంచనావేయు టిపుడు

38

సాయంసమయాన సారెత్రిప్పు
కుంభకారుని చేయి
మట్టి నెంతలోమార్చి సొగసైన
కుండ చేసెనోయి!
దానినుండి యింపైన నిశ్శబ్ద
వాణి వెలువడియె
"తమ్ముడా! మట్టియని మరవకుమా
నా నిరుపేద బాధ" అనియె

39

పాత్ర ఖాళీయయ్యె నింపుము
నింపుము మరల మరల
కాలప్రవాహము కాలిక్రింద
తరలు తరలు
పోయిన నిన్నటిగురించి
కుందె దేల?
రానున్న రేపటికాలాల
కాంక్షించె దేల?
ఈనాటి మకరంద మాను
వెనుకాడె దేల?

40

అగుమాగు మొక్కనిమేష మీ
యమరాజ్యపు టెడారి
హెమ్ము ఒక్కనిమేష మ్మి
పానీయాలఁద్రావి దప్పితీరి
తారాగణ మస్తమించు సమయాన
మజిలీసాగు ఎడారిఓడలకు
త్వరపడుచు చనునవి ఉషస్సుల
శూన్యమౌ రేవులకు
ఆదిమధ్యావసానాలె
లేని కాలాలకు

41

ఎంతకాలము భరింతు వీ ఆశల
వంతను క్రుంగుచు
అది దొరకు ఇది వేవు ఒకటి వలపించు
నింకొకటి మురిపించు
దొరకు ద్రాక్షల యనుభవసంపదల
తృప్తిపడయుమా !
దొరకనిపండ్ల క్రులుచాచి
చింతింపకుమా !

42

మిత్రమా ! నూత్నవైవాహిక
ప్రయత్న సంరంభాలు చూడుమా !
గేహ ప్రాంగణ తోరణ రసాల
కిసలయాల పసల గనుమా !
వదలితి నిష్ఫల శుష్కవాదనా
కన్య విసయాన
సరస సౌందర్యమయాసవకన్య
కుసుమసమాన
భవ్య నవ్య దివ్య కరసంస్పర్శనా
సౌఖ్యభాగ్యాన
మున్నలెత్తి తప్పబ్బై తలక్రిందైతి
నమ్ము నీయాన

43

"ఔను" "కాదు" అనువాదాల
నాలోచనా తులలోన తూచితూచి
మెరకపల్లాల సరియైన కొల్తల
లెక్క గట్టి గట్టి
విషయప్రపంచపు చుట్టుకొల్త
లెల్ల కలయంగ వెతకి వెతకి
ఈ వినువులెక్కలు నాకు సుంతేని
వలదు వల దంచును
నిర్మలాసవ పీయూష మకరందములో
కంటి తన్మయత్వంబును

44

ప్రాంతఃకాల కాంతుల
లేతవెలుగులో కంటి
పానశాల గుమ్మాన మెల్లమెల్లన
నడయాడు నొంటి
విద్యుల్లతభాతి ఛళఛళలాడు
తిలోత్తమ హస్తామృత భాండమ్ము
ఆమె మృదులాజ్ఞ జవిచూచి
తది ద్రాక్షాసవమ్మో సుమ్ము!

45

తిరుగెరుగని యాసవ తర్క
ప్రజ్ఞా విశేషాల
ప్రాక్ష సమయించు నానామత
భయంకరవివాదాల
అసవమ్మో నాగార్జునుని మించు
రసాయనవేత్త
కలదు చిటుకలో వట్టిమట్టిని
మేల్మిపసిడిచేయు సత్త



(2)

46

అరిరాజ తండాల
    సునాయాసాన కీడడంచు
భూతప్రేతాల చెడుపూజ
    లెల్ల బిట్టడంచు
భయవిచారాలను పిశాచాల
    నాత్మగేహమునుండి పారద్రోలు
ప్రజ్వల వజ్రాయుధహస్తు
    డనమానపరాక్రముండు మన ప్రోలు

47

వేదాంతులు పండితులు
    పోరాడుదు రెల్లపుడు
నాకు వదలు డీవిషయతత్వ
    వాదప్రతివాదాల నెపుడు
విధి నియంత మిమ్మందరను
    బొమ్మలనుజేసి ఆడించు
మీదు నాతని నాటపాటల
    తేలించుడు నయ్యాట మించ

48

ఓ ప్రేయసీ ! యేదిక్కు చూచినా
    యెందెందు వెదకినా
కాన్పించునదెల్ల మాయతెరపై
    బొమ్మలాటలేనా ?
సూర్యుడను పెనుదీప
    కాంతి చ్ఛాయల
చుట్టును పరిభ్రమించు
    కల్లనీడలమె మనమెల్ల

49

నీవింత ప్రేమించి
 శ్లాఘించు ద్రాక్షాసవమ్ము
నీవాను ప్రేయసి
 మధురాధర పీయూషమ్ము
ఎన్నాళ్ళీభోగములు
 కొన్నాళ్ళేగదా యనును
వట్టి శుష్కనీతులు
 పఠించు వేదాంతియును
పాప మత డెరుగడు
 జీవితమ్మే నాటక మ్మంచును
దినమొులన్ వచ్చి తీవు
 దినమొులనే పోదువునుమ్ము
సుంతేని దాచదీ నగ్న
 సౌందర్యమ్ము నీ వింతవస్త్రమ్ము

50

వీచు నదీతటాన సువాసనాభరిత
 మలయమారుతమ్ము
ఖయ్యాము సాహచర్య సుఖసమయాన
 త్రాగు కెంపుద్రాక్షాసవమ్ము
యమదూత వచ్చి యిచ్చినది
 కాలకూటవిషమా ?
అయిన నే యరమరయులేక
 నిస్సంశయాన నానుమా !

51

ఇదంతయు పగలు రాత్రులచే
 నిర్మింపబడ్డ చదరంగపుపీట
కర్మ యాటగాడు నేర్పున
 నడుపు బలాలయాట
ఒక్కటొక్కటి నల్లన నడిపించి
 యెత్తుకు పైయెత్తు వేయును
చంపు కొన్ని యెడల
 జంతువుల బంట్లను
కొన్ని యెడల సయ్యాటగా
 బంటుతో త్రోసిరాజనును

52

కుడియెడమ లను
వ్యత్యాసాలులేకనే
ఎటుకొట్టిన నటుపోవు
బంతివలెనే
పోను రాననక నడువుమా
కర్మరాజు నాజ్ఞనే
రంగాన దింపిన ఆటగా డెరుగడే
నీ భావి తెరువును
చిక్కువ్యూహాల రహస్యాలెల్ల
ఆ జెట్టి చక్కగా నెరుగును

53

కలముసాగు ముత్యాల
అక్షరాల నాట్యాల
ఎంత కఠినతపంబైన
నరికట్టదు దాని విన్యాసాల
అది సుంతేని వెనుకకే
రాబోదు రాబోదు
అశ్రు ధారా వృష్టిచే
పోబోదు పోబోదు

54

తిరుగబడ్డ గిన్నె
యానీలి ఆకాశపాత్ర
దానిక్రిందనే మన సుఖదుఃఖ
సంసారయాత్ర
యెంత యెలుగెత్తి యేడ్చినా
వృథాయాసమె సుమా!
అదియు నీవలె నావలె త్రోయబడు
"పాళి"యే వినుమా!

55

బ్రహ్మ సృష్టిచేసిననాటి
మట్టిముద్దలతోనె
ప్రళయకాలపు వారి
కర్మలెల్ల చక్కనల్లె
తుదిపంట విత్తనా లెల్ల
నప్పుడే చల్లె
ప్రథమోదయంపు కవిలికట్టలలోనె
గ్రామకరణము వ్రాసె
తూ చా తప్పక చివరవర
కాసామివారీ లెక్కలెల్ల జేసె

56

నాయాత్ర సాగించు
తొలినాటి వేళనే
ఉచ్చైశ్శ్రవానాన స్వారిచేయు
నారంభ దివసాననే
నాదారియెల్ల గురుని
స్వాధీనమయ్యె
అటునిటు కదలక కర్మపు త్రాళ్ళ నతడె
చక్కగ చిక్కబట్టనయ్యె

57

ద్రాక్షతీవియ పెనువృక్షశాఖ
నాశ్రయించినరీతి నాశరీర
మెల్ల నానవమ్మె ప్రాకెను
సర్వమున్ విడిచి బూది
నాశ్రయించిన సన్యాసి
దీనినెల్లను సేవగించును
అతడు మోక్షద్వారము
తెరువ తెరువెరుగక
బాదుచున్నాడు తలుపు
నా చెలియె యెరుగు
నేమొ ఆరహస్య
ద్వారపు మలుపు

58

ఏది యెట్లున్న నాకిదిమాత్ర
        మ్మెరుకసుమీ !
కామక్రోధా లను పెనుభూతాలమధ్య
        చిక్క నశింపనీ
లేక సప్తవ్యసనాల జయించి
        ప్రేమాహింసల నవలంబింపనీ
అనవశాలాంతర్భాగాన కంటి మానవ
        హృదయ నైజస్వరూపమ్ము
గర్భగుళ్ళ చీకట్లలో కనుపింపదీ
        నిరుపేద హృదయసౌందర్యము

59

మార్గమెల్ల దొంగగోతులు
        మాయబోనులుగ పగ బెట్టి
కర్మరజ్జువుతో కదలనీక
        గట్టిగ బిగగట్టి
నేనుజేయు పాపమ్ముల
        కెల్ల నేలనయ్యా !
నన్నె బాధ్యునిజేతు నం
        చరమరలేక పలికెదయ్యా !

60

మట్టిముద్దల మనుజుల నిర్మించి
        వ్యసనభరితులజేసి
కాన్పించు నెరలెల్ల కాంక్షించి
        పుచ్చుల బడునట్లు వ్రాసి
విషయలంపట పాపపంకిలులైన
        దీనమానవుల సంపూర్తి
కావకున్న నిన్నెవరు క్షమింతురయ్యా
        ఓ పుణ్యమూర్తి !

61

ఉపవాస పర్వంపు నియమాలెల్ల
వినయమ్ముగా గడపి
సాయంసమయాన నూత్నచంద్రోదయ
వేళ నల్లన నడచి
కుంభకారునింటి
కేకాకినై సాగితి
వరుసచేర్చిన కుండలమధ్య
నిశ్చలుండనై ఆగితి

62

ఆశ్చర్య మాశ్చర్యమ్ము కుండలలో
కలవరము కాసాగె నంత
వాటి కులపెద్ద యొకటి "పటపట"
మని పలుకజొచ్చె వింత
"కుమ్మరెవరో కుండలేవో
చెప్పగలవో ?" యని
నే చేతనావిహీనుడనై నిలచితి
కొయ్యబొమ్మనోయన విని

63

ఒకకూజా పలికె "చైతన్య
విహీనమైన వట్టి మట్టి
స్వహస్తాన నిపుణత
కుంభకారుడే సానబట్టి
ఊరక పొడిపొడిచేసి మరల
పుట్టిగలపునా" అనుచు
"ఇట్టి కార్యాల కెట్టి కారణాలుగలవొ
నీకు తెలియునా ?" అనుచు

64

ఒకపాత్ర పలికె "ఎంతవింతబాలుడైన
నెప్పుడు వినియుండ నెందు
తానే మధురాసవముచేయు నాపాత్ర
పట్టిగలుపు టెందు
ప్రేమపూర్వముగ జేసిన
వస్తునంచయమ్ము
పూర్తిగ కోపాన పొడిచేయు
టెందును లేదునుమ్ము"

65

జవాబు రాలేదు రాలేదు
ఈ యక్షప్రశ్నల కెందున
జాగు కొంతయిన వెనుక
పలికె నొక వంకరపాత్ర మెల్లన
"అష్టవంకరలకెల్ల నన్నేల
రొష్టుపెట్టు నిజనంబు
చేతకాక చేసిన కుమ్మరిని
వెలివేయుడు కళానంమంబు"

66

"అల్లరిమూకలకునెల్ల మంచి
కుమ్మరియం దసూయ నుమ్ము
ఆతని సృష్టి మాయల త్రోయజాతు
రదియెల్ల మోసమ్ము
కుంభకారుడు కఠినపరీక్ష
చేయుట అసత్యమ్ము
అతనిచేబుట్టిన మన నేల
నతడే త్రోసిపుచ్చు నమ్ము"

67

సీత్కారముతో నొక పాత్ర
యిట్లు చక్కగ నుడివె
"నా శరీరమెల్ల జ్వరబాధ
తడిబాసి యెండువడియె
దివ్యామృతమ్మిడుమా యదియె
ఆతప నివారణోపాయంబు
క్రమశః — స్వస్థదాయక నిత్య నవ్య
దివ్యౌషధరాజంబు—"

68

ఇట్లొక్కొక్క పాత్ర పలుకుచు
చూచె నావంక
ఇంతలో సర్వజనామోదమ్ముగ
పొడసూపె చంద్రవంక
అంత నానందాన
నందరును నపేక్ష
"తమ్ముడా! తమ్ముడా! మానుమా
యింక కఠినోపవాసదీక్ష
వినుము సోరూరు నానవపు
కావిళ్ళ కిర్రు"లనిరి కాంక్ష

69

నా అవసానకాలాన మనసార
మధురసమ్ముల నిమ్ము
ఈ ద్రవమ్ముననే కడుగుమా
నా మృతకళేబరమ్ము
పచ్చని ద్రాక్షపత్రాల తీగల
చిక్కజుట్టి
నా హృద్యోద్యానవనమందు
చేయుముమట్టి

70

నామరణానంతరము భూగర్భస్థమౌ
బూదియైన పోదు వమ్ముగా
వెదజల్లు చక్కటి సర్వసుమ
సౌరభ్య మిమ్ముగా
రహదారిలో సాగు కళాత్మకు
లబ్బురము వడరె
సమాధుల వింత శుభాల
సంవాసనల కనరె

71

అకటా! యిన్నాళ్లుగా పూజించు
నభిమానవిగ్రహాలె
పూర్తిగా నను సంఘదృష్టి
వెలివేసి అస్పృశ్యుజేసె
నా గౌరవంబెల్ల చిన్న
ఆసవపాత్ర ముంచె
కష్టించి ఆర్జించు పేరెల్ల
చిల్లిగవ్వ కమ్ముడుచేసె

72

అనేకసార్లీ ఆసవకన్య విడనాడెద నం
చొట్టుపెట్టలేదా?
అట్టి ప్రతినపట్టుకాలాల ద్రాక్షా
కషాయంపు నిషాలో లేనా?
ఇంతలోనె వసంతమొదవి
హస్తాన గులాబిపెట్టె
నేమిసేతు నా కఠినదీక్షనెల్ల
వమ్ముజేసె నిట్టె

73

ఆ మ్లేచ్ఛయువతి బాహువల్లరి
నా మర్యాదనెల్ల నేలగలిపివేసె
కులమ్మునకే పూర్తి అపకీర్తి
వాటిల్లజేసె
గతజల సేతుబంధన
మ్మేలగాని
నే వింతపడుదు "నీ దుకాణదారు
లేలనో కనుచు
వెలలేని ఆసవమ్మమ్మి చౌకవస్తువు
లెల్ల కొందు"రనుచు

74

అహహ ! యెంతశోచనీయమ్ము లీ
గులాబుల కెంజాయల రుచులు
మాయముచేయు వసంత
కాలావసానదశలు
యౌవన సౌందర్య కాంతులెల్ల
వెలివోవు వర్షీయసీ కేశాలలో
పంచమ స్వరాన నింపుగా పాడు
పిక మ్మెగిరిపోయి యింతలో
ఏ కోనకు చనెనో
ఏగానము వినెనో !

75

ప్రేయసీ ! నీవునేనును మెల్లన
కర్మతో జట్టుకట్టి
ఈ విషాదపూరిత జీవసామాగ్రి
నెల్ల చేబట్టి
దుమ్ముదుమ్ముచేసి విచారమ్మె
పారద్రోలి
చేయమా ? ఆనందలహరుల దేలు
నూత్నసృష్టిని జాలి

76

అంచల మించు నందాల నొలికించు
ఓ నవ్వులరాణి!
చూడు చూడు మదిగో బాలచంద్రుని
నెమ్మోము కాని
భవిష్యత్కాలాల పూర్ణిమా
పూర్ణనిశ లెల్లను
వేసారు నతడు నాకొరకె
వెదకి తోటలెల్లను

77

వింతకాంతుల వెదజల్లు నీ
రమ్యహర్మ్యాల నీడల
నవనవలాడు సౌందర్యవనాల
నాసీనులౌ కన్యకాలలామల
మధుర ద్రాక్షారస ధారల
తేలించి సుఖించు నమయాల
కందుదేమొ నే నాసవపాత్ర
విసర్జించిన స్థలాల.

# గ్రీకు రూపకములు

## ఉపోద్ఘాతం :

ప్రాచీన గ్రీసుదేశపు విషాదాంతనాటకరంగాన్ని గురించి మొట్టమొదట తెలియజేసినవాడు వెల్కర్ అనే జర్మనీ పండితుడు. ఇతడు 1826లో తన "శటిర్స్పియల్" అనే గ్రంథంలో – మొదట "డితిరామ్బు అనే ఆటతో ఆశువుగా పాడబడుతూ ఉండే నృత్యగేయంనుంచి పరిహాస నాటకం (శటరిక్ డ్రామా) ద్వారా విషాదాంత నాటకం (ట్రాజడి) ఉత్పన్నమయ్యింది" – అని పేర్కొన్నాడు.

మద్యానికి నాటక రంగానికి అధిదేవత అయిన "డయనీసస్" ఉత్సవాలలో కొంతమంది కలిసి "డితిరామ్బు" అనే నృత్యం చేసేవారు. ఈ నర్తకులు "డయనీసస్" సేవకులైన దేవతల వేషం వేసుకొనేవారు. "డయనీసస్" దేవుని సేవకులైన దేవతలకు "శటిర్స్" అని పేరు. ఈ దేవతలు మేకలను పోలి ఉండేవారు. అందువల్ల మేకకొమ్ములు, చెవులు, డెక్కలు, తోకలు, చర్మం మొదలైనవే యీ వేషధారులకు దుస్తులు. వీరు మేక చర్మాన్ని మొలకు చడ్డీవలె ధరించేవారు. అందువల్ల యీ బృందగానంలో (కోరస్లో) పాల్గొనేవారికి "ట్రాగోయ్లు" అని పేరు వచ్చింది. క్రమంగా ఈ "డితిరామ్బు" అనే హాస్యనృత్యగేయం ఆశువుగా కాకముందుగానే రచింపబడుతూ కొంత ఉన్నతస్థాయిని అందుకొనడంతో "శటరిక్ డ్రామా" అనే పేరు వచ్చింది. బృందగాన (కోరస్) దళానికి నాయకుడు ఒక డుండేవాడు. ఈ నాయకుడే కాలక్రమాన దళంనుండి విడివడి నటుడయ్యాడు. దీనితోపాటు నాటకరచనాశైలి కూడా ఉత్తమస్థాయి నందుకొన్నది. "శటరిక్" నాటకానికి తర్వాత "ట్రాగోయ్డియా" (మేకపాట) అనే పేరు స్థిరపడింది. కాని నాటకంలో పాల్గొనే కోరస్ దళంలోనివారు మాత్రం యింకా "శటిర్స్" గానే ఉండిపోయారు. ఈ దేవతలు స్వరూపంలోనే కాక స్వభావంలో కూడా జంతుతత్వం కలవారు. అందువల్ల నాటకం అసభ్యంగాను అపరిష్కృతంగానూ ఉండేది. గ్రీకు నాటకాన్ని యీ స్థితినుంచి ఉత్తమస్థాయికి తీసికొనివచ్చినవాడు క్రీస్తుకు పూర్వం 525–456 సంవత్సరాల మధ్యవున్న "ఈస్కిలస్" – ఈతని చేతిలో గ్రీకు నాటకం ఉత్తమ సాహిత్యరూపం దాల్చింది. "శటిర్స్"ను కూడా మార్చివేసి "కోరస్"లోను, నాటకంలోనూ పాల్గొనే వారినందరినీ యితడు మానవులుగా తీర్చి

దిద్దాడు. అయినప్పటికీ ప్రతి నాటకకర్తయు నాటకోత్సవాల్లో మూడు విషాదాంత నాటకాలను, ఒక "శటైర్" నాటకాన్ని తప్పకుండా ప్రదర్శించి తీరాలనే నియమం పెట్టడం జరిగింది. ఈ నియమం "శటైర్" నాటకాలు పూర్తిగా విస్మరింపబడకుండా ఉండడానికి యేర్పరచడం జరిగి ఉండవచ్చును.

పైన పేర్కొన్న విషయాలన్నీ "వెల్కర్" పేర్కొన్నవే. తరువాతివారు దీనిని సంపూర్ణంగా ఆమోదించలేదు. ఆమోదించని వారిలో గ్రీకు భాషలో పండితాఖండలులైన డాక్టర్ ఎమిల్ రైఖ్, పికర్డ్ కేంబ్రిడ్జి ప్రభృతులున్నారు. "గ్రీకు నాటకరంగం – నాటకం" అన్న గ్రంథాన్ని రచించిన డాక్టర్ "ఫ్లికింజర్" ట్రాజడీని శటైరును డితిరాంబు నాట్యంనుంచి వెలువడిన రెండు శాఖలుగా భావించాడు. వెల్కర్ భావించిన విధంగా "డితిరాంబు"లో నుంచి శటైర్‌ను, అందులోనుంచి "ట్రాజడీ"యును వచ్చాయని యితడు భావించలేదు. ఈ విధంగా యెవరి సిద్ధాంతాల కనుగుణంగా వారుచేసిన యీ వాదప్రతివాదాలతో ప్రస్తుతం మనకు అవసరం లేదు గ్రీకు నాటక పరిణామవికాసాలేవిధంగా వచ్చాయో పరిశీలించడమే మనకు ప్రస్తుతం అవసరం.

ఇప్పటికి ఉపలభ్యమానాలయిన ఈస్కిలస్, సోఫోక్లిజ్, యూరిపిడిజ్‌ల నాటకాలలో అన్నీకూడా క్రీ.పూ. అయిదవ శతాబ్దిలో రచింపబడినవే. వాటికి పూర్వం సాహిత్య నాటకీయ సంప్రదాయం సమృద్ధిగా ఉన్నది. నాటి నాటకాలలో కన్పించే కళాస్వరూపం యొక్క గాంభీర్య వైశాల్య భూయిష్ఠతలకు ఇవే మూలాలు. సాహిత్యశిఖరాలనదగిన హోమరు గ్రంథాలు (ఇతిహాసకావ్యాలు)—ఇలియడ్, ఒడెస్సీలు—కూడా అత్యంత ప్రముఖమైనవి. అకృత్రిమంగాను ఆడంబరరహితంగానే కాక ఆశ్చర్యకరంగాను హేత్వాభాసంగానూ మానవజీవితపు సమగ్రజీవితాన్ని ఇవి ప్రదర్శిస్తూ ఉంటాయి. క్రీ.పూ. 8 వ శతాబ్దినాటి హోమరు కావ్యాలకూ, 5 వ శతాబ్దినాటి ఉత్తమ విషాదాంతకావ్యత్రయ కాలానికి మధ్యకాలాన నాగరికతలో అనేక పరిణామాలు వచ్చాయి. ఆధ్యాత్మికవిచారం ప్రారంభమయ్యింది. పారలౌకిక విషయాలను గురించి, మానవతను గురించి ఆలోచనలు జిజ్ఞాసా బయలుదేరాయి. ఆత్మనివేదనం ఉజ్జ్వలంగా ఒనప్పగల భావకవి సమాజం యొకటి యీ కాలంలోనే తలయెత్తింది. మానవస్వభావాన్ని అవగతం చేసుకొన్న శాఫో, అల్‌సీఅస్, సీమొనడీజ్‌లు భావగీతాల నాలాపించారు. ఈ కవితా సంప్రదాయం ఒక్క కవులకే కాక సహృదయ ప్రేక్షకులకు కూడా ఉపకారకారకమయ్యింది. ఏథెన్సు పౌరులు తాము వినే మహాకావ్య పాఠాలలో తన్మయులై మునిగిపోయేవారు.

ఈ విధంగా క్రమంగా లభించిన అనుభవంతో క్లిష్టాలైన ఛందస్సులతో, ఉజ్వల సమున్నతాలైన భావాలతో కూడిన బృందగీతాలతో నిండియున్న విషాదాంత నాటకాలను సైతం చూచి వారు హర్షామోదాలను తెల్పడం సాగించారు.

తొలుదొల్త క్రీ.పూ. 5 వ శతాబ్దిలో కొన్ని ప్రత్యేకోత్సవాల సందర్భంలోనే యీ నాటకాలు ప్రదర్శింపబడుతూ ఉండేవి.

## గ్రీకు నాటకరంగం :

ప్రాచీనకాలంలో ఈ నాటకాలు వెయ్యడానికి కొండల మధ్యభాగంలో ఆరుబయలుగా ఒక ప్రదర్శనాప్రదేశం యేర్పాటు చెయ్యబడుతూ ఉండేది. ఈ నాటక ప్రదర్శనా ప్రదేశాన్ని "థియేట్రస్" లేక "కోయిలన్" అని వ్యవహరించేవారు. సోపానక్రమంలో అర్థచంద్రాకృతిగా ఉండి, పూసివేసిన గుర్రపు డెక్కవంటి స్టేడియాన్ని యీ ప్రదర్శనాప్రదేశం పోలి ఉండేది. అందులో ఒక్కొక్క తరగతిలో గల సీట్లవరకూ యెక్కడానికి "క్లిమోకియో" అనబడే సోపానాలుండేవి. థియేట్రస్ పై భాగాన్ని దిగువ భాగాన్ని ప్రత్యేకిస్తూ చదునైన ప్రక్కభాగం కూడా ఉండేది. క్రింద ఉత్తమ స్థానంలో "డయనీసస్" మతాధిపతి ఉన్నతాసనం ఉండేది. ఆ ప్రదర్శనాని కితడొక విధంగా అధ్యక్షత వహిస్తాడని చెప్పవచ్చును. ఈ నాటక ప్రదర్శనాప్రదేశం చాలా పెద్దదిగా ఉండేది. ఏతెన్సులో ఉన్న డయనీసస్ థియేటరులో ఎయ్‌రాపలిస్ దక్షిణపు వాలులమీద నుంచి దాదాపు 17,000 మంది ఆసీనులవ్వడానికి తగినంతగా చుట్టూ గట్లు ఉండేవి. వాటిక్రింద నాటక ప్రదర్శకుల నిమిత్తం చదునైన వలయాకారస్థలం ఆర్కెస్ట్రా (నృత్యరంగం) ఉండేది. ఆర్కెస్ట్రాకు మధ్యగా ఒక బలిపీఠం వుంటుంది. నాటకాభినయంలో కొంతభాగం, అంటే, విన్యాసక్రమాలు నృత్యబృంద నృత్యాలు మొదలైనవి ఆర్కెస్ట్రాలో జరుగుతూ వుండేవి. ఆర్కెస్ట్రాకు కుడి యెడమ భాగాల్లో ప్రత్యేకంగా హద్దులేర్పరచబడిన మార్గాలుండేవి. ప్రేక్షకులు, నటులు, బృందగాయకులు ప్రదర్శనాప్రదేశంలోకి ప్రవేశించడానికి బైటికి వెళ్ళడానికి యీ మార్గాలుపయోగించబడేవి. ఆర్కెస్ట్రాకు వెనుక భాగాన రంగస్థలం వుండేది. దాని వెనుక నేపథ్య గృహం వుండేది. ప్రారంభకాలంలోనూ, క్రీ.పూ. 5 వ శతాబ్ద్యంతంలోనూ నేపథ్యగృహం ఒక దారు నిర్మాణంగా ఉండేది. తరువాత క్రమంగా స్థిరమైన శిలాభవనమే నిర్మించబడింది. చాలా నాటకాలలో నేపథ్యగృహం గృహముఖాన్నో ప్రాసాద ముఖాన్నో దేవాలయ ముఖాన్నో సూచిస్తూ వుండేది. రంగులు వెయ్యబడిన తిరుగుడు చక్రాలు,

పార్శ్వాలకు వేర్వేరు రంగులు వేయబడి పరిభ్రమించుచుతూ ఉండే రివాల్వింగ్ ప్రిజమ్స్ మొదలైన వివిధసాధనాలు రంగం మారినట్లు సూచించడానికి ఉపయోగింప బడుతూ వుండేవి. రంగులు వెయ్యబడిన కొయ్య తెరుగుడు చక్రాలు నేపథ్యగృహానికి అనుబంధాలుగా వుండేవి. ఒక్కొక్కప్పుడు నేపథ్య గృహం ముందువరుసలో నృత్యరంగానికి (ఆర్కెస్ట్రాకు) వెనుకగా రంగస్థల పురోభాగంలో యివి బిగింపబడుతూ వుండేవి. నేపథ్యగృహానికి సాధారణంగా మూడు ద్వారాలుండేవి. అవి నటుల ప్రవేశ నిష్క్రమణాలకు, ఇతర అవసరాలకు ఉపయోగించబడుతూ ఉండేవి. క్రీ.పూ. 5 వ శతాబ్దిలో నేపథ్యగృహం పురోభాగంలో ఆర్కెస్ట్రాకు ఒక సోపానం పైగా ఎత్తైన పీఠముండేది. దీన్ని ప్రొస్కీనియన్ లేక లోజినియన్ అనేవారు. ఇక్కడే నాటకాభినయనం యెక్కువగా జరిగేది. అవసరమైనప్పుడు నటులు ఆర్కెస్ట్రాలోకి దిగి అభినయం చేసేవారు. తక్కిన సమయాల్లో రంగస్థలంలోనే నాటకాభినయం జరిగేది.

క్రమంగా కొంత కాలానికి రంగస్థలస్థానంలో ఒక భవనం వంటిది ఏర్పడింది. ఆర్కెస్ట్రానుంచి యీ భవనం పైకెక్కి నాటకాభినయంచేసేవారు. లాంగ్ ప్రొస్కీనియన్ నేపథ్యగృహం ముందు వరండాకు రెండుప్రక్కలా ప్రొస్కీనియన్ నేపథ్య గృహ పార్శ్వాలు అని రెండుండేవి. రంగభవనం దారు నిర్మాణమైనప్పుడు దాని ఆకృతిని వివిధవిధాలుగా మార్చడానికి యీ పార్శ్వగృహాలుపయోగపడేవి. స్థిరమైన శిలాగృహం యేర్పడినప్పుడు యీ పార్శ్వగృహాలు ఎలా ఉపయోగపడ్డాయో స్పష్టంగా తెలియదు. క్రీ.పూ. 5 వ శతాబ్దిలో ఉపయోగించిన సాధనలు మరిరెండు ఉండేవి. నేపథ్య గృహంముందే నాటకాలన్నీ ప్రదర్శింపబడడంచేత నాటకాలలోని బహిర్దృశ్యాలు మాత్రమే ఉండి అభినయమంతా సాధారణంగా గృహంముందో హర్మ్యంముందో దేవాలయంముందో జరుగుతూ వుండేవి. ఈ లోపాన్ని పూరించడానికి, ఇళ్ళలోని దృశ్యాలను సూచించడానికి యూరిపిడిజ్, అరిస్టోఫెనిజ్ ఇంకా మరికొందరూ ఎకిలీమా అనే ఒకచక్రవేదికనుపయోగించేవారు. ఇది అంతర్దృశ్యానికి సూచికగా భావింపబడుతూ వుండేది. నాటకవస్తువుల్లో క్లిష్టసమస్యలను పరిష్కరించడానికి భగవంతుని జోక్యం అవసరమైనప్పుడు అతడు ఉపరితలం నుంచి అవతరించాలి గదా! కనుక క్రేన్ (ఓడ కొంగవంటి ఒక వాహనం) భగవంతుని వేషధారి నిమిత్తం లోపలికి వచ్చేది. దానిమీద ఆ భగవంతు డవతరించేవాడు. "డి అస్ ఎక్స్‌మెకనా" యంత్రంనుంచి దేవుడు అని యీ వాహనాన్ని పిలిచేవారు. నాటక వస్తువులోని సమస్యలకు హేత్వాభాసాలు అసమంజసాలు అయిన పరిష్కారాలను చూపడానికి యిది ఒక మార్గంగా రూఢికెక్కింది.

ఈ విధమైన హంగులతో సౌకర్యములతో అనాడు నాటక ప్రదర్శనలు జరిగేవి. ఈ ప్రదర్శనలు సామాన్యంగా ప్రత్యేక ఉత్సవాల సమయాల్లో మాత్రమే జరిగేవని యితఃపూర్వమే సూచించడం జరిగింది.

## ఉత్సవాలు :

క్రీస్తుపూర్వం 5 వ శతాబ్దిలో ఏతెన్సు నగరంలో నాటకాలు సాధారణంగా రెండు సందర్భాల్లో మాత్రమే— అందులోనూ మత సంబంధమైన ఉత్సవాలలో మాత్రమే— ప్రదర్శింపబడుతూ ఉండేవి. ఇతర సమయాలలో గ్రీకుజాతీయుల జానపదోత్సవాల్లో ప్రదర్శింపబడేవి. ఏతెన్సులో ఎక్కువ ప్రాముఖ్యంలేని ఉత్సవాన్ని "లెనా" లేదా "ఫెస్టివల్ ఆఫ్ వైన్ ప్రెస్" అనేవారు. ఇటువంటి ఉత్సవం జనవరి, ఫిబ్రవరి నెలల్లో జరిగేది. సాధారణంగా యీ ఉత్సవం మోదాంతనాటకాలకే ప్రసిద్ధి. అయినా కొన్ని విషాదాంత నాటకాలు కూడా ప్రదర్శింపబడుతూ ఉండేవి. ఎక్కువ ప్రాముఖ్యంకల ఉత్సవానికి "గ్రేటర్ సిటీ డయనీషియా" అని పేరు. "డయనీసస్" దేవుని గౌరవార్థంగా యిది మార్చి-ఏప్రిల్ నెలల్లో జరుగుతూ ఉండేది. అధిక సంఖ్యాకులైన ప్రేక్షకులీ ప్రదర్శనకు హాజరవుతూ వుండేవారు. కేకలు బొబ్బలు పెడుతూ యీ ప్రేక్షకులు తమ ఆమోదాన్నిగాని, నిరసననుగాని వ్యక్తంచేసేవారు. ఒక్కొక్కసారి పళ్ళుకూడా విసిరి వేసేవారు. పాపం! ఒకనటుడు ఒకసారి యీ విధంగానే అసంతుష్టి చెందిన ప్రేక్షకుల రాళ్ళ దెబ్బలతో చచ్చేంతపనిజరిగింది. నాటకాలకు ప్రవేశం ఉచితంగా ఉండేది. కాని క్రమంగా తరువాత కాలంలో రెండు నాణాలు ప్రవేశరుసుం పెట్టారు. బీదవారెవరైనా కోరినట్లయితే ప్రభుత్వం డబ్బును ముదరాగా యిచ్చేది.

గ్రేటర్ డయనీషియాలో నాటక రచయితలకు మోదాంత నాటకాలలో ఒకటి, విషాదాంత నాటకాలలో ఒకటి, 'డితిరామ్బు'లో ఒకటి – మొత్తం మూడు పోటీలు జరుగుతూ ఉండేవి. పెలోపోనీసియన్ యుద్ధానికి పూర్వం యీ ఉత్సవం ఆరురోజులు జరిగేది. మొదటి రోజున విధ్యుక్తంగా జరిగే ఊరేగింపును, రెండవ రోజున "డితిరామ్బియా" బృందగానాల పోటీలు జరిగేవి. "డితిరామ్బు" సుశిక్షితులైన యాభై మందివున్న గాయకబృందం గానంచేసే డయనీసస్ పూజా విషయంకల బృందగీతం. ఈ బృందగీతం పోటీలో పది బృందాలు పాల్గొనేవి. మూడవ రోజున అయిదుగురు మోదాంత నాటకకవులు ఒక్కొక్క కృతిని పోటీకి సమర్పించేవారు. చివరి మూడు రోజుల్లో ముగ్గురు విషాదాంత నాటకకవులు

ఒక్కొక్కరూ మూడేసి విషాదాంతనాటకాలను, ఒక్కొక్క హాస్య (శటైర్) నాటకాన్ని పోటీలకు సమర్పించేవారు.

ప్రతి నాటక ప్రయోగానికీ చాలా శ్రద్ధవహింపబడుతూ ఉండేది. ఎంతో ధనవ్యయం జరుగుతూ ఉండేది. నాటకరచయితే ప్రదర్శనాదర్శకత్వం వహించి అవసరమైతే స్వయంగా పాత్రధారణ కూడా చేస్తూ వుండేవాడు. విషాదాంత నాటకాల్లో ముగ్గురు పాత్రలకంటె యెక్కువగా ఉండేవారుకారు. పౌరుల్లో సంపన్నుడైన వాడొకడు యీ నాటకప్రయోగ వ్యయమంతా భరించేవాడు.

విషాదాంత నాటకాలు విపులాలు, క్లిష్టాలు అయిన కళా విశేషాలు, సంభాషణ లోను పద్య పఠనంలోను లయ, సుస్పష్టమైన అభినయం, ఉజ్వాలవస్త్రప్రదర్శనం మొదలైన విచిత్రాంశాలిందులో సమ్మేళనమొంది వుండేవి. బృందగీతాలలో సంగీతము ఉండనే ఉండేది. ఇంక యీ నాటకాలలో వాద్యసంగీతం, బృంద గానం, ఉత్తమ స్థాయి నృత్యంకూడా వుండేవి. ముఖవైఖరీ విన్యాసాలవల్ల భావ ప్రదర్శనంచేసి రక్తికట్టించడం కష్టసాధ్యమైన విషయమని అనాటి ప్రేక్షకుల నిశ్చితాభిప్రాయ మవడంచేత నటులంతా కృత్రిమ ముఖాలు ధరించేవారు. ఎత్తుగా కన్పించడానికి, విగ్రహౌన్నతిని పెంచుకోడానికి నటులు విషాదాంతనాటకోచితాలైన యెత్తుమడమల బూట్లు ధరించేవారు.

గ్రీకు విషాదాంత నాటకాలు కొన్ని విభాగాలు చేయ బడ్డాయి. నాటకం నాందీ ప్రస్తావనలతో ప్రారంభమయ్యేది. వీటిల్లో ఒక పాత్ర సంభాషణమాత్రంగాని, యిద్దరిదిగాని వుండేది. ఇది నాటక సందర్భాన్ని ప్రెక్షకులకు పరిచయంచేసే చిన్న దృశ్యం. పిమ్మట బృందగానం ప్రారంభమయ్యేది. బృందనాయకులు పాడుతూ ఆడుతూ వాద్యబృందంలో చేరేవారు. 5 వ శతాబ్ది తర్వాత కాలక్రమాన బృందగానం ప్రాముఖ్యం తగ్గిపోయింది. మొదట నాటకాభినయంతో యిది గాఢాను బంధం కలిగి ఉండేది. ఈస్కిలస్ కృతమైన "దినప్లయంట్స్" ఇందుకు ఉదాహరణంగా గ్రహించ వచ్చును. కాని యూరిపిడిజ్ కృతాలైన అనంతర నాటకాలలో బృందగాయకులు నాటకంతో సంబంధంలేని భావగీతాలు పాడుతూ ఉండేవారు. సాధారణంగా బృందగాయకులు నాటకాంతం వరకూ వాద్యబృందం దగ్గరేవుండేవారు. విషాదాంతనాటకాల గాయక బృందంలో సాధారణంగా పదిహేనుమంది సభ్యులుంటారు. వారిలో ఒకడు నాయకుడుగా ఉంటాడు. అతడు వాద్య సంగీతంతో నృత్యం చేస్తాడు. కొన్ని సమయాల్లో గాయకబృందం రెండుగా చీలి ఒక దానికి ప్రత్యుత్తరంగా రెండోది పాడడం జరిగేది. ఒక బృందం

ఆర్కెస్ట్రాతో ఒకవైపు పరిక్రమిస్తూ "స్ట్రోఫి" అనే గేయ విశేషాన్ని పాడుతుంది. రెండవ బృందం దానికి ప్రత్యుత్తరంగా "యాంటి స్ట్రోఫి" అనే మరొక గేయ విశేషాన్ని పాడుతుంది. కొన్ని సందర్భాలలో యీ బృందగానంతో మరొక విధమైన గేయ విశేషంకూడా పాడడం జరుగుతుంది. ప్రారంభబృందగానం యీ విధంగా పూర్తిఅయిన వెంటనే మొదట ప్రాసంగిక కథనం వస్తుంది. ఆధునిక నాటకంలోని అంకానికి లేదా రంగానికి యిది సమానమై వుంటుంది. సాధారణంగా యిది మూడు పాత్రలమధ్య జరిగే సంభాషణారూపంగా వుంటుంది. బృందగానం ఒకటి యీ ప్రాసంగిక కథనాన్ని అనుసరిస్తుంది. అందులో చివరలో యిది రెండు భాగాలుగా చీలి సంవాదరూపమైన బృందగానంగా మారుతుంది. సాధారణంగా నాటకమిట్లా నాల్గైదు భాగాలుగా రూపొందుతుంది. ప్రత్యేక సందర్భాల్లో బృంద గానం (కోరస్) స్థానాన్ని మరొకవిధమైన బృందగానం ("కోమస్" పేరనున్నది) ఆక్రమిస్తుంది. బృందగానానికి (కోరస్‌కి), కోమస్‌కి ఛందోభేదమే భేదం. ప్రాసంగిక కథనాలు బృందగానాలు అయిన తరువాత, "ఎగ్జోడస్" అనబడే ముగింపు దృశ్యం కూడా పూర్తి అయిన తర్వాత గాయకబృందం పార్శ్వ మార్గాల ప్రేక్షకుల దృష్టి పథంనుంచి తప్పుకొంటుంది. గ్రీకు విషాదాంతనాటకం చదివేవారు అందరూ అభిన్నంగావుండే లయానుగుణ ప్రవృత్తినాదం, గీతం, సంగీతాల నెంతమాత్రమూ మరువ కుండా వుండడం చాలా ముఖ్యమైన విషయంగా వుంటుంది. ఈ విధంగా పరిణమించిన గ్రీకు నాటకరంగంలో అసలు "డితిరామ్బు" మొదలైన నృత్యాది రచనలు యేవిధంగా ఆవిర్భవించి రూపొందాయో సూక్ష్మంగా గ్రహించడం అవసరం.

క్రీ. పూ. 7 వ శతాబ్ది మధ్యలో "కారింత్" నగరవాసి అయిన "ఏరియన్" అనే రచయిత "డితిరామ్బు" నృత్య గేయాన్ని ఆశువుగా కాక ఛందస్సు ననుసరించి వ్రాయ నారంభించాడు. అప్పటినుంచే "డితిరామ్బు" నృత్యగేయం సారస్వతరూపం తాల్చింది. క్రీ. పూ. 639–559 ప్రాంతంలో "ఏతెన్స్" నగరాధి పతి అయిన "సోలాన్" వ్రాసిన రచనలైన "ఎలిజీస్" వల్ల యీ అంశం నిర్వివాదంగా ధ్రువమవుతున్నది. మొట్టమొదట విషాదాంత నాటకాన్ని "ఏరియన్" ప్రవేశ పెట్టాడని "సోలాన్" స్పష్టంగా పేర్కొన్నాడు. తన రచనను "నాటకం" గా మొదట పేర్కొన్న వాడు "ఏరియన్" అనడానికి ఎటువంటి సందేహమూ లేదు. క్రీ. పూ. 6 వ శతాబ్ది పూర్తి కాకముందే "డితిరామ్బు" సారస్వతంలో స్థానం సంపాదించుకొన్నది. "కోరస్"లో యాభైమంది నాట్యంచేస్తూ ఛందోబద్ధాలైన పాటలు పాడుతుండేవారు.

"ఏరియన్" తరువాత రచయితలలో సుప్రసిద్ధుడైనవాడు "సిష్యాన్" నగర వాసి అయిన "ఎపిజీనీస్." ఈ "సిష్యాన్" నగరం "పెలొపోనీసస్" రాష్ట్రంలోనిది. ఇది "డోరియన్" జాతివారికి నివాసస్థానం. ప్రథమ విషాదాంత నాటకకర్త యీతడే అని కొంతమంది పండితుల వాదం. "తెస్పిస్" ఇతనికి తరువాతివాడేనని ప్రసిద్ధి. "సిష్యాన్" అధిపతి అయిన "క్లీస్తనీజ్," క్రీ.పూ. 590 లో మేకను బహుమతిగా యేర్పరచి అంతకుముందు సిష్యాన్ రాజైన "ఎడ్రాస్టస్" గౌరవార్థం జరుగుతున్న ఉత్సవాన్ని "డయనీసస్" పూజార్థంగా మార్చివేశాడు. ఎడ్రాస్టస్‌పట్ల క్లీస్తనీజ్‌కున్న వైరభావమే యీ మార్పుకు కారణం. అంతకుముందు – అంటే, ఎడ్రాస్టస్ గౌరవార్థమే ఉత్సవాలు జరుగుతున్నప్పుడు – మేకను బహుమతిగా యివ్వడం జరిగేది కాదు. ఈ ఉత్సవ పరిణామానికి తరువాత మొదటి నాటకాన్ని ఎపిజీనీస్ వ్రాశాడు. ఈ నాటక రచన జరిగినప్పటినుంచి "కోరస్"లో కారింత్‌లోవలె డయనీసస్ సేవకులైన శటిర్స్‌కు సంబంధం తొలగింపబడింది. కారింత్‌లోవలె యీ నాట్యానికి 'శటిర్' నాటకం అని కాక ట్రాజడీ (మేక నాటకం) అని నామాంతరం యేర్పడింది.

క్రీ.పూ. 6 వ శతాబ్దిలో "ఎటికా" రాష్ట్రంలో అయోనిక్ జాతి ప్రసిద్ధిచెందిన జాతి. ఇంతవరకూ "పెలొపోనీసస్" రాష్ట్రాన్ని గురించి కారింత్, సిష్యాన్ పట్టణాల పౌరులను గురించి, పెలొపోనీసస్ రాష్ట్రవాసులైన డోరియన్ జాతివారిని గురించి తెల్సుకున్నాము. ఇప్పుడు ఎటికా రాష్ట్రాన్ని, ఆ రాష్ట్రంలో ఉన్న ఎకేరియా – ఏథెన్స్ పట్టణాలను, ఆయా పట్టణవాసులైన అయోనిక్ జాతివారిని గురించి యింక మనం తెలుసుకొనవలసి ఉంది. డోరియనులలో డయనీసస్ సేవకులైన "శటిర్స్"కు మేకరూపం ఉండేది. కాని అయోనియన్‌లలో "శటిర్స్"కు గుర్రపు రూపముండేది. క్రీ.పూ. 450 వరకూ యీ విధంగానే ఉన్నది. ఆ తరువాత ఎటికా పింగాణి పాత్రలమీద మేకరూపు శటైర్లు కనిపిస్తాయి. ఈ మార్పు అప్పటినుంచే వచ్చి వుంటుంది.

"కారింత్"లో ఏరియన్‌కు పూర్వం యే విధంగా డితిరాంబు అనబడుతూ బృందగానం (కోరస్) తో కలసిన నాట్యముండేదో ఆ విధంగానే ఎటికాలో కూడా వుండేది. దానికి ఎకేరియా నివాసి అయిన తెస్పిస్ సారస్వతరూపం యిచ్చాడు. ఈ తెస్పిసే పెలొపోనీసస్ రాష్ట్రంలోని కొన్ని ఆచారాలను గ్రహించి, మరి కొన్నింటిని ఊహించి ట్రాజడీకి నూతన జీవితాన్ని కలుగజేశాడు. పూర్వ సంప్రదాయాల ననుసరించి ఛందోబద్ధమైన కవిత్వాన్ని, మేకను బహుమతిగా యివ్వడాన్ని యితడు గ్రహించాడు. నటుణ్ణి సృష్టించడమనేది యితని స్వయంప్రతిభామూలకం.

డితిరామ్బులో బృందగాన (కోరస్) దళనాయకు డుండేవాడు. కొరిఫీయస్ అని అతని పేరు. అంటే, సూత్రధారుడన్నమాట. రచయిత తాను స్వయంగా యీ పాత్ర నిర్వహించేవారు. ఈ దళంలో ఉన్నవారే కార్యోలీ అనే ప్రశ్నలు వేస్తూవుండగా కొరిఫీయస్ (సూత్రధారుడు) సమాధానాలు చెప్పుతూ ఉండేవాడు. ఈ ఆచారాన్ని అనుసరించే పురోగమిస్తూ బృందగానదళం (కోరస్) నుంచి సూత్రధారుణ్ణి వేరు పరచి స్వతంత్రుడైన నటవ్యక్తిగా చూపడం "తెస్పిస్" చేసిన మహత్తరమైన కార్యం. అందువల్లనే 'యాక్టర్' (నటుడు) అనే పదం జవాబు చెప్పేవాడనే అర్థంలో ప్రయోగింపబడింది. సాఫోక్లిజ్ కాలందాకనూ ఆయా రచయితలే తమ తమ నాటకాల్లో నటులుగా ఉండేవారు. అరిస్టాటిల్ కూడా యీ విధంగానే పేర్కొన్నాడు ఈ సమీక్షవల్ల "డితిరామ్బు" నాట్యగాన సూత్రధారునినుంచి విషాదాంత నాటకం యే విధంగా అవతరించిందో తెలుస్తుంది. డితిరామ్బు నాట్యంలో నటనగాని, పాత్రోచితవేషధారణగాని వుండేది కాదు.

తెస్పిస్ దీనిని సమగ్రంగా మార్చివేసి నాటకాభివృద్ధికి మహత్తరమైన సేవ చేశాడు. తాను స్వయంగా డయనీసస్ పాత్ర ధరించేవాడు. అందువల్ల మునుపటి రీతిగా డయనీసస్ సేవకులవలె వారి పాటలను పాడటమే కాక వేషధారణ చేసేట్లుగా కూడా చేశాడు. డయనీసస్ సేవకులు శటీర్స్, అనగా, మేకరూపు కలవారు. కాగా వారు మేక తోలు, మేక కొమ్ములు ధరించవలసి వచ్చేది. ఇంతేకాదు : మేకలవలె అభినయించవలసి వచ్చేది. ఇది భావి నాటకాభివృద్ధికి అత్యంతప్రధానమైన ఉపచారమని వేరె చెప్పనవసరం లేదు. అందువల్ల నటుడు పాత్రలో పూర్తిగా లీనమై, ప్రేక్షకుడు తనలో భావైక్యం పొందే అవకాశం యేర్పడి నాటకంలో రసస్ఫూర్తికి అనిర్వచనీయమైన దోహదం కలిగేది. కాబట్టి "కావ్యేషు నాటకం రమ్యం" అన్న సూక్తి ఉత్పన్నమైనది. ఈ సందర్భంలో మనం చెప్పుకో దగిన వింతకథ ఒకటి ఉన్నది. క్రీ.పూ. 639-559 ప్రాంతంలో ఏతెన్సు నగర పరిపాలకుడైన సోలన్, తెస్పిస్ నాటకం చూడడానికి వెళ్లాడట. అంతకు ముందు నాట్యంచేసి పాటలు పాడడం తప్ప వేషధారణమే లేదు గదా! తెస్పిస్ నిర్వహిస్తున్న నూతన విధానాన్ని చూచి "ఈ విధంగా మాయనటన చేసి ప్రజల యెదుట అబద్ధ మాడడానికి సిగ్గులేదా?" అని సోలన్ గద్దించి అడిగాడట. దీనికి సమాధానంగా తెస్పిస్ "నాటకంలో వినోదానికాడితే ప్రమాదం యేముంది?" అని సమాధానం చెప్పాడట. వెంటనే సోలన్ తన చేతికర్రతో నేలమీద కొట్టి "మనమీ నటనను మెచ్చి గౌరవించినట్లయితే యిటువంటి నటనే ప్రజావ్యవహారాల్లో ప్రవేశించగలదు" అని కోపంతో అన్నాడట.

తెస్పిస్ గ్రీకు నాటక ప్రపితామహుడని యీ పర్యాలోచనవల్ల స్పష్టమవు తున్నది. కాని యితడే నాటకానికి సమగ్ర స్వరూపాన్ని యివ్వలేదు. ఆ పని చేసినవా రితని తరువాతివారు. కొన్ని ప్రధానాంశాలను మాత్రమే యితడు ప్రవేశపెట్టాడనడం సత్యమే కాని నాటకంలో మోటుతనం మిగిలే ఉన్నది. ఉన్నత సారస్వతస్థాయిని అది పొందలేదుకూడా. క్రీ.పూ. 534 లో పెజిస్ట్రేటస్ అనే ఏతెన్సు నియంత సిటీ డయనీసియా అనే పేర డయనీసస్ ఎల్యూతేరియస్ దేవుని పూజకొరకు ఒక ఉత్సవాన్ని ప్రారంభించాడు. ఎల్యూతేరియస్ పట్టణంనుంచి తీసుకొనివచ్చిన విగ్రహానికి జరిగే పూజావిధానం కాబట్టి దీనికా పేరు వచ్చింది. ఎల్యూతేరియస్‌లో డయనీసస్‌కు నల్లమేక చర్మం ధరించినవాడని పేరు. ఈ ఉత్సవంలో విషాదాంత నాటకాల పోటీలు ముఖ్య కార్యక్రమంగా యేర్పాటు చేయబడ్డాయి. మొదటి పోటీలో తెస్పిస్ తగిన విజయం పొందాడు. తొలిమేక బహుమానం తెస్పిస్‌కే లభించింది. కాని నాటకం మాత్రం పరిపూర్ణస్థితి నందుకొనలేదు. భాషాడంబరం, అసభ్యత, వాచాలత మొదలైన అవగుణాల సంగతి చెప్పనవసరం లేదు. కాలక్రమాన యివి ఈస్కిలస్ చేతిలో మారిపోయి, ఉన్నతస్థాయికి వచ్చాయి.

తెస్పిస్ తరువాత ఫెలస్ పట్టణ నివాసి అయిన ప్రాటినస్ పేర్కొనదగినవాడు. ఫైలస్ పట్టణం పెలోపోనీసస్ రాష్ట్రంలోనిదని యీ రాష్ట్ర ప్రజలు డోరియన్ జాతివారనీ యిదివరకే పేర్కొనడం జరిగింది. ప్రాటినస్ పద్దెనిమిది ట్రాజడీలను, ముప్పైరెండు శటైరిక్ నాటకాలను వ్రాశాడు. కాగా మన మిప్పటికి మూడు విధాలైన నాటక విభేదాలను చూడగలిగాము: 1 ఆశువుగా చెప్పి పాడే డితిరామ్బు. ఇది పల్లెలలో పరిపాటిగా ఉండేది. 2. ఛందోబద్ధంగా వ్రాయబడుతూ సారస్వతస్థాయి నందుకొన్న డితిరామ్బు. క్రీ.పూ. 508 నుంచి యిది ఏతెన్సులో జరుగుతున్న సిటీ డయనీసియా ఉత్సవాల్లో ఒక భాగంగా ఉండేది. 3. విషాదాంత (ట్రాజడీ) నాటకం. ఈ పరిస్థితుల్లో ట్రాజడీల్లో కేవలం మద్యానికి అధిదేవత అయిన డయనీసస్ గురించి వ్రాసే పద్ధతి మారింది. కాని ప్రజల్లో మాత్రం కొంత పూర్వాచార పరాయణత, సాంప్రదాయానుసరణము వుంటుంది గదా! అందువల్ల కేవలం డయనీసస్‌ను గురించి నాటకాలు చూడాలనుకొనేవారు చాలామంది వుండేవారు. దీన్ని గుర్తించిన ప్రాటినస్ తన స్వస్థలమైన ఫైలస్‌లో సారస్వతస్థాయి నందిన డితిరామ్బును ఎటికా రాష్ట్రంలోని ట్రాజడీని కలిపి శటైర్ ప్లేస్ వ్రాశాడు. ఆ శటైర్ నాటకాల యితి వృత్తాలు డయనీసస్‌కు సంబంధించినవే; ఇవి డయనీసస్ ఉత్సవాల సందర్భంలో ప్రదర్శింపబడేవే. కాబట్టి ఈ విధంగా ఉండడం సముచితమే ననిపించుకుంటుంది. డయనీసస్ ఉత్సవాలలో మేకను బహుమానంగా యిచ్చే పద్ధతి క్రీ. పూ. 501 లో

మార్చివేయబడింది. అంతేకాక ఔత్సాహిక నటులు నూతన విహారైన నాటకాలను ప్రదర్శించడానికి ప్రారంభించారు. ఈ నాటకాలే కామెడీలు (సుఖాంతనాటకాలు)గా పరివర్తన చెందాయి. ఇప్పటినుంచే ప్రతినాటకకర్తా మూడు విషాదాంత నాటకాలకు ఒక శటైరు నాటకాన్ని ప్రదర్శించాలన్న నియమంకూడా ప్రవేశపెట్టబడింది. ప్రాటినస్ క్రీ.పూ. 499 లో ఈస్కిలస్‌తో పోటీచేసినట్లు తెలుస్తున్నది. ప్రాటినసే శటైర్ నాటకాలను ప్రవేశపెట్టింది బహుశా క్రీ.పూ. 517 లో కావచ్చును. శటైరు నాటకాలలో రెండు రకాలైన వేషాలున్నట్లు ప్రాచీనపాత్రల వైఖరి తెల్పుచున్నది. ఒక రకమైనవారు గుర్రపు దుస్తులు. ఇంకొక రకమైనవారు మేక దుస్తులు ధరించే వారు. కాని యీ భేదం నాటకాలలో పాల్గొనేవారు పూర్తిగా సాధించినట్లు కనిపించదు. ఒకవేళ పండుగులలో ధరించే దుస్తులలో యిటువంటి భేదం పాటింపబడేదేమో ! గుర్రపు దుస్తులవారికి సైలిని అని, మేక దుస్తులవారికి శటైర్స్ అని పేర్లు. నేపుల్సు లోని క్రీ.పూ. 400 నాటి ప్రాచీన గ్రీకు పాత్రమీద శటైర్ నాటకానికి సన్నద్ధమవు తున్న దృశ్యం ఒకటి చిత్రింపబడి ఉంది. ఈ దృశ్యంలో మేకతోలు, చెడ్డీ, గుర్రపు తోక మాత్రం కనిపిస్తాయి. కొమ్ములుగాని, కాళ్ళకు మేకడెక్కలు లేదా గుర్రపు డెక్కలుగాని కనిపించవు. అప్పటికీ దుస్తులు శటైర్ నాటకాలలో పాల్గొనేవారికి నిర్ణయమై వున్నట్లు ధ్రువపడుచున్నది.

గ్రీకు ట్రాజడీని యెవరు ప్రారంభించారనే విషయం వివాదగ్రస్తమైనదిగా వున్నది. ఏరియన్, ఎపిజీనీస్, తెస్పిస్‌లు ముగ్గురిని ప్రారంభకులుగా పేర్కొన వచ్చునని కొందరంటున్నారు. మరికొందరు ఈస్కిలస్ మొదటి విషాదాంత నాటక కర్త అని దృఢంగా విశ్వసిస్తున్నారు. ఏది యెట్లాఉన్నా ఏరియన్, ఎపిజీనీస్‌లకు పూర్వం ట్రాజడీగా గుర్తించదగిన గ్రీకు రచనే లేదని, తెస్పిస్, ఈస్కిలస్‌ల తరు వాతనే ట్రాజడీ పూర్ణస్వరూపం పొందిందని మాత్రం స్పష్టంగా చెప్పవచ్చును.

## ఈస్కిలస్ :

గ్రీకు విషాదాంత నాటకాలన్నిటిలోనూ ఈస్కిలస్, సోఫోక్లిజ్, యూరిపిడిజ్‌ల నాటకాలే సజీవాలుగా నిలిచివున్నాయి. సజీవాలుగావున్న యీ నాటకాలుకూడా యీ రచయితలు రచించిన వాటిలో చాలా అల్పభాగం మాత్రమే. ఈ ముగ్గురి లోనూ ప్రాచీనుడైన ఈస్కిలస్ క్రీ.పూ. 525 లో ఏతెన్సు నగరంలో ఒక ప్రముఖ కుటుంబంలో జన్మించాడు. ఆ కాలంలో యీ నగరానికి యెక్కువ ప్రాముఖ్యం రాలేదు. ఈస్కిలస్ బాలుడుగా వున్నప్పుడు "డయనీసస్" దేవుడు స్వప్నంలో కనపడి విషాదాంత నాటకాలు వ్రాయవలసిందిగా ఆజ్ఞాపించినట్లు ఒక కథ ప్రాచీన

కాలం నుంచీ ప్రచారంలో ఉన్నది. ఇతన్ని "పైథాగరియన్"గా చెప్పే సంప్రదాయంకూడా ఉన్నది. అంతేకాక "ఎల్యూసినియన్" రహస్యాల ప్రోత్సాహకుడని కూడా పేర్కొనబడ్డాడు. ఒకప్పు డితడు ఎల్యూసినియన్ రహస్యవిశేషాలను వెల్లడి చెయ్యడంచేత దేశభక్తి హీనుడనే నిందకు గురైనట్లు భావించడం జరిగింది.

క్రీస్తుకు పూర్వం 499 లో ఏథెన్సులో జరిగిన నాటకాల పోటీల్లో ఈస్కిలస్ పాల్గొన్నాడు. ఇంతకుపూర్వం 484 లో జరిగిన పోటీల్లోకూడా పాల్గొని విజయం పొందాడు. అది ప్రముఖంగా పేర్కొనదగిన విజయం కాదు. దీని తర్వాత జరిగిన అనేక పోటీల్లో ఉన్నత విజయాలను పొందాడు. ఈస్కిలస్ కేవలం రచయిత మాత్రమేకాదు. గొప్ప యోధుడుకూడా. "మేరతన్" లోనూ, "శలిమిస్" లోనూ జరిగిన యుద్ధాలలో యితడు పోరాడాడు. ఇతడు తొంభై నాటకాలు వ్రాస్తే వాటిల్లో యేడు మాత్రమే నిలిచి వున్నాయి. ఎప్పుడైనాగానీ పోటీల్లో పదమూడు సార్లు బహుమతులు పొందాడు. ఈస్కిలస్ క్రీ.పూ. 455 లో సిసిలీలో కీర్తిశేషు డయ్యాడు. గ్రీసు దేశంలో ఏథెన్సు నగరం అత్యద్భుతమైన ఔన్నత్యదశను పొందడం యితడు తన అవసానకాలంలో చూడగల్గాడు.

ఈస్కిలస్ నాటకంలో సాంకేతికశక్తి క్రమాభివృద్ధి మనకు స్పష్టంగా కన్పిస్తుంది. బృందగానానికి అధికపాత్రగల యితని ప్రథమ నాటకమైన "ది సప్లయింట్స్" లో విషాదాంత నాయకుడు మొదటిసారిగా కనిపిస్తాడు. "ది సెవెన్ ఎగెనెస్ట్ థీబ్స్" నుంచి నాటకీయత అత్యంతవికాసం పొందిన "ఒరెస్టియా" వరకూ మనం ఎంతో అభివృద్ధిని చూడగలం. ఈ నూతనసృష్టి నాటకీయ సంభావ్యతను గమనించే యితడు రెండవ నటుణ్ణి నిల్పాడని "అరిస్టాటిల్" చెప్పకుండానే తెలుస్తుంది. సాఫాక్లిజ్ ననుసరించి యీతడు ఒరిస్టీస్‌లో మూడవ నటుణ్ణికూడా నిల్పాడు. మనకు లభిస్తున్న నాటకాలను బట్టి యీతని భావనావిశిష్టతను, శైలి ఔన్నత్యాన్ని విశేషంగా మనం గుర్తించగలం. ఇతని భాషాపరిపుష్టి, సార్థకశబ్దప్రయోగ ఔచితి అత్యంత ప్రశంసనీయాలు. ఉత్తమ కవీశ్వరునికి ఉండదగిన కవితా గాంభీర్య వైశిత్యాలతో యీతని భావాలు అలరారుతూ వుంటాయి. మతవిషయంలోనూ, తాత్త్విక విషయాల్లోనూ యితనికి ఆసక్తి మెండని చెప్పవచ్చును. విశ్వజనీనమైన వనీ, ముఖ్యమైనవనీ తాను భావించే మతతాత్త్విక సమస్యల ప్రభావం కలవిగా మానవుల సంగతులను ఇతడు సమీక్షిస్తాడు. పశ్చిమ యూరప్ సంస్కృతికి సంబంధించిన రచనలలో దివ్యత్వాన్నిగూర్చి ఉత్తమాలు, ప్రశస్తాలు అయిన భావాలున్న వాటిల్లో ఒకటిగా భాసించే "ఒరెస్టా" ను యితడు సమర్థవంతంగా తీర్చిదిద్ది పరిసమాప్తి కావించగల్గాడు.

## సోఫోక్లిజ్ :

సోఫోక్లిజ్ యూరిపిడిస్ కంటే ముందుగా, అంటే, దాదాపు క్రీ.పూ. 495 ప్రాంతాన జన్మించి తొంభై యేండ్లు జీవించి క్రీ.పూ. 405లో కీర్తిశేషుడయ్యాడు. ఇతని కుటుంబం సంపన్నవంతమైంది. ప్రభుత్వకార్యాలయాల్లో అనేకపర్యాయాలు ఉద్యోగం చేశాడు. సోఫోక్లిజ్ నూట యిరవై నాటకాలు రచించగా వాటిలో దాదాపు యేడు మాత్రమే లభ్యమవుతున్నాయి. ఇతని నాటకాలు విషాదాంత నాటకాల పోటీలలో యిరవై పర్యాయాలు విజయం పొందగా అమేయమైన ఖ్యాతి పొందాడు. కళాకౌశలంతోనూ అతిగంభీరమైన భావగ్రహణాశక్తిలోనూ పరిణితుడైన సోఫోక్లిజ్ ప్రతిభాపరిమితులను నిర్ణయించడానికి విమర్శకులకు సాధ్యమయ్యేదికాదు. ఇతని నాటకాలన్నిటిలోనూ ముఖ్యంగా "ఎడిపస్ ది కింగ్" అన్న దానిలో ఇతని నాటకీయతా వైదుష్యం స్పష్టంగా కనిపిస్తూ ఉంటుంది. ఈ "ఎడిపస్ ది కింగ్" లోనూ, "ఎజాక్స్" నాటకంలోనూ, "ఫిలాక్టిటీజ్" లోనూ ఇతడు తన రచనా వైదుష్యంతో పరాంకోటి నధిరోహించాడు. వాటిల్లో యీతడు పతాకాస్థానకాన్ని (డ్రమెటిక్ ఐరనీ) అధికంగా ఉపయోగించాడు. మానవజీవితాన్ని గూర్చి యితని దృక్పథం యెటువంటిదో యితని రెండు గేయనాటకాల్లో స్పష్టంగా గోచరమవుతుంది. యాంటిగనిలో మానవీయతాద్భుతాలను, 'ఎడిపస్ ది కింగ్'లో స్వర్గసూత్రాలను ప్రతిబింబింపజేశాడు. జీవితాన్ని గురించి 'సోఫోక్లిజ్' దృక్పథంలో రెండంశాలున్నాయి. స్వర్గ నిర్దేశాన్ని, దాని శాశ్వత సూత్రాలను అనుసరించి మానవుడు తన గమ్యాన్ని తానే రూపొందించుకొనడం ఒకటి. అమాయికంగా తనకు తెలియక తన తల్లినే వివాహమాడి స్వర్గనియమాల నతిక్రమించిన ఎడిపస్ అంతర్మథనమూ, చివరిగా అతని పతనమూ పై అభిప్రాయానికి నిదర్శనాలు.

ఈస్కిలస్ బోధనా విధానము మత తాత్త్విక శాఖాభిముఖంగా ఉంటుంది. యూరిపిడిస్ ముఖ్యంగా మానవుల విషయాల్లో ఆస్థకలిగి వుంటాడు. మానవ స్థాయిలో అతిక్లిష్టాలైన మానవ సమస్యల నెదుర్కొనేటప్పుడు వారి మానసిక పరిస్థితులపట్ల కూడా యితని కాసక్తి వున్నది. ఈ యిద్దరి కవులకూ మధ్యస్థంగా సోఫోక్లిజ్ స్థితి వుంటుంది. ఈస్కిలస్ నియతితోపాటు యూరిపిడిస్ మానసిక పరిశీలన కూడా యితనికున్నాయి. ఇతనిలో దైవీయ మానవీయ సంఘర్షణ యెల్లప్పుడూ కన్పిస్తూ వుంటుంది. ఇతని మానవ జీవితభాష్యం గంభీరమైనదేగాక విస్తృతమూ సార్వభౌమత్వమూ కలది. సృజనాత్మకమైన పశ్చిమ యూరపు సాహిత్యంలో దీనికి తుల్యమైనదెక్కడో వొక్కటి వున్నా యిది అసాధారణమైనదే అనవచ్చును.

మేము నీ ముందు అవనత శిరస్కులమై వున్నాము. జ్ఞానదైవం వలెనే నిన్ను సత్యానికి ప్రతిబింబమైన భగవంతునిగా కీర్తిస్తాము. ప్రతి కాంతికిరణంలోనూ, సత్యపూర్వకమైన చూపులోనూ, నీవే! నీ ప్రభావం లేకుండా అవి నిలబడలేవు. అవన్నీ నీనుంచే జ్ఞానం అనే జలయంత్రంనుండి ప్రవహిస్తున్నాయి. "తెలివి" అనేది చిన్న మాటకాని "విజ్ఞానం" నిన్ను జ్ఞానంగా ప్రతిబింబింప చేస్తూన్నది. ఆ జ్ఞానతృష్ణా కాంక్ష యుగ యుగాలనుంచీ వస్తున్నది. నక్షత్రాల కావల, ప్రపంచం ఏర్పడడానికి ముందు అంతు తెలియని ఆత్మయొక్క అగాధాలలోతులకు వెళ్ళింది నీవేగదా జ్ఞానదైవమా! బయల్పరచబడిన సత్యం, జ్ఞానం మానవుని దరికి చేర్చబడిన సత్యం జ్ఞానం. జీవనయాత్రలో ఆత్మకు దారి చూపించేది జ్ఞానం. పసిబాలులు ఆశగా నమ్మకంగా ప్రేమాదరాలలో వున్న తల్లి దండ్రులవైపు చూచినట్లుగా వుండే సత్యమే జ్ఞానం. జ్ఞానం జీవనగతిలో దారిచూపే కాంతివంటిది. అది మహాత్ములలో అంతర్భూతమై, సాధువుల హృదయాలలో చొచ్చుకొని మహర్షులను దీపిస్తుంది. అది నిస్సహాయులను రక్షించడమే గాక మనిషిలో మనిషికి నమ్మకాన్ని కలిగిస్తుంది. జ్ఞానదైవమైన నీకు ఇవే మా నివాళులు! అర్చనలు!

ఈ సత్యం శాశ్వతమైంది. ఈ జ్ఞానం అందరినీ వరించేదే. నీవు మహాత్ముడివి. అనంతుడివి. నీవు ప్రతి మనిషిలో స్థావరం ఏర్పరచుకొని నిన్ను నీవు పెంపొందించుకుంటున్నావు. నీ ఉనికికీ, చర్యలకూ, నీ గొప్పదనం యొక్క ఉచ్ఛస్థితికి, నీ విశాలత్వానికి కొలబద్ద నీ అనంతత్వమే! నీవు అనుక్షణం ఏదో ఒక అద్భుతాన్ని సృష్టిస్తూ అనశ్వరుడిగా, అనంతుడిగా పెరుగుతున్నావు. అట్టి నీముందు మోకరిల్లి ఇవే మా నీరాజనాలర్పిస్తున్నాము. నీతో సరితూగకలవారు ఎవరూ లేరు. నీవు విశ్వాన్నంతా నిండివున్న అనంత బ్రహ్మవు. అనంత శక్తిమంతుడివి. విశ్వానికి మూలకారకుడివి ఐన నిన్ను కొంచెం కూడా తెలుసుకోవడం చాలాకష్టం. ఇది మా ముక్తికన్నా మాకోరిక. ఇది మాశాశ్వత కాంక్ష. అంతవరకు నీకు మేము సేవచేస్తూనే వుంటాము.

అనంత ప్రపంచాన్నంతా ఆవరించుకువున్న అనంతుడివి. కనుక నీవు అనంతరూప మమృతమ్. ఆ విధంగా నీవు విశ్వాన్నంతటా ఆక్రమించుకుని వున్నావు. శాశ్వతమైన ఆనందామృతంలో నీవు సర్వకాల సర్వావస్థలలోనూ ప్రతిబింబిస్తుంటావు.

కనుక నీవు నీ ఆనందంలో, శాంతంగా నీ అమృతంలో శివంగా పునరుద్భూతమవుతుంటావు.

మరొకసారి అందరినీ ఏకం చేసే అవిభాజ్యమైన మహత్తర శక్తి నీది. నీవు అద్వైతానివి. అంతులేని అనంత ప్రేమకు నిలయానివి నీవు. ఆ విధంగా నీవు అందరినీ ఏకం చేసే, పవిత్రం చేసే మహా భగవంతుడివి.

ప్రాణికోటికి బంధవిముక్తినీ, పరిపూర్ణతను కలిగించేవాడు భగవంతుడు. పరమాత్ముని యొక్క ఈ ప్రకృతి విధానం ద్వారానే మనం నిత్యమూ, శాశ్వతమూ అయిన గమ్యాన్ని చేరుకుంటాం. "శుద్ధ మపాపవిద్ధం" అనే పవిత్ర లక్ష్యం కూడా దీని ద్వారానే సిద్ధిస్తుంది. ఇది పాపరహితమైనది. లోపరహితమైనది. నీ ఆరాధనలో ఆనంద పారవశ్యం చెందడంకన్న వేరే కోరికలేదు. అన్య ఆకర్షణలను విడనాడి, ఆశామోహాలను పరిత్యజించి నీ పవిత్రతలో మేము జీవిస్తాము. పరమ పవిత్రుడైన పరమాత్ముని పవిత్ర సంతానం యొక్క అమరత్వం ఇది. దైవత్వము సిద్ధించిన మానవులుగా నిరంతర ఆశీర్వచన బలంతో వున్నాము. నీ నామము ఇప్పుడును ఎప్పుడైనను చిరస్థాయిగా వుండుగాక!"

'ధన్యవాద సమర్పణము' కంటె చక్కని ప్రవచనము ఆంగ్ల సాహిత్యంలో నా దృష్టికి రాలేదు.

## "ధన్యవాద సమర్పణము":

ప్రార్థన—అంతయు నీదయ (తెలుగు)

"ఇదంతా నీకరుణ ఫలితమని, అజ్ఞానులం, సంకుచిత దృష్టిగల వారం అయిన మాకు కూడా స్పష్టంగా తెలుస్తున్నది. అడుగకుండానే మా అవసరాలన్నిటినీ—తలవని తలంపుగా తటస్థించేవి కూడా—నీవు తీరుస్తున్నావు. తల్లికి బిడ్డలపట్ల వుండే శ్రద్ధ, ప్రేమ వాత్సల్యాలతో మమ్ములనందర్నీ పోషించి రక్షించుతున్నావు. జీవన విధానం మానసిక దృష్టిని మరుగుపరిచి, హృదయ భావాలను చలన రహితంచేసి, ఆత్మదృష్టికి అడ్డుపడి, నిన్ను మానుండి చాటుచేస్తున్నది. జీవితంలో మాకు కలుగుతున్న ఈ సౌకర్యాలు నీకు తెలియకుండానే చేకూరుతున్నాయని, వీటిని నీవు స్వయంగా కల్పించలేదని అప్పుడప్పుడూ మా అజ్ఞానంచేత భావిస్తూ వుంటాము. సూర్యుడు వెలుగును ప్రసాదిస్తాడు; నదులు నీటిని అందిస్తాయి; మందమారుతాలు మనోల్లాసకరంగా వీస్తాయి; భూదేవి సృష్టి భారాన్ని వహిస్తుంది. జీవితం ప్రారంభమై, విస్తృతినొంది, పరిసమాప్త మవుతుంది. కుటుంబాలు ఏర్పడతాయి; తెగలు సమకూడుతాయి; తల్లిదండ్రులు పోషణ చేస్తారు; ఉపాధ్యాయులు జ్ఞానభిక్ష పెడతారు; మిత్రులు సహాయపడతారు;

పిల్లలు తల్లిదండ్రులను, భార్య భర్తను, భర్త భార్యను ప్రేమిస్తారు. ఈ విధంగా నీ సృష్టిజాలంలో మేము ఇమిడి వున్నాము. అయినా నిన్ను మేము మరిచిపోతాం. మేము మా హృదయ నేత్రాన్ని తెరిచినట్లయితే జీవితపు అనుబంధాలన్నింటిలోనూ నీవు సాక్షాత్కరించడం చూడగలుగుతాం. అందుకు మేము ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని పొందుతాం. పురోభివృద్ధికై అన్ని ప్రయత్నాలూ, పాట్లూ స్వీయాభివృద్ధికీ, సేవకు సమస్త సౌకర్యాలు—ఇవన్నీ కూడా నీవు సృష్టించినవే. కేవలం ప్రపంచ భవితవ్యానికి సంబంధించిన విశాలమైన విషయాలలోనే గాకుండా ప్రతి ప్రాణికి సంబంధించిన చిన్నవిషయాలలో కూడా నీవు దృగ్గోచర మవుతావు. పసిపిల్లలకుండే నిర్మల హృదయం మాకున్నట్లయితే భోజన సమయంలో నీవుకూడా మాలో కలిసి ప్రేమతో భోజనం చేస్తున్నట్లు గ్రహించగలిగేవారం. "సేవకుడు కొనితెస్తాడు. వంటవాడు పక్వాలు సిద్ధంచేస్తాడు. నేను భుజిస్తాను" అనుకోవడం వాస్తవికానికి వక్రభాష్యమే అవుతుంది. ప్రతిరోజూ, ప్రతిగంటకూడా శిశువును తల్లి పోషించే విధంగా మమ్ములను సంరక్షిస్తున్నావు. ప్రతి శిశువు జీవితానికి అవసరమైన ఆహారాన్ని ప్రతికబళాన్ని నీవే శిశువు నోటికి అందిస్తున్నావు. శిశువు త్రాగే పానీయం మాతృమూర్తి యొక్క ప్రేమామృతము. సేదదీరి మనోల్లాసం పొందడానికి శిశువు తల్లి వడిలో నిద్రిస్తాడు. రాత్రి అంటే ఏమిటి? శిశువు తల్లి వడిలో ఏకాంతంగా నిద్రించి తెల్లవారిన తరువాత మనోల్లాసం కలిగించే జీవితంలో తిరిగి ప్రవేశించడం కాదా? ఉదయాస్తమయాలు, ఋతువులు, వత్సరాలు ఇవన్నీకూడా నీవు నీ శిశువుల ఆనందం కొరకు, క్షేమం కొరకు ఏర్పరచినవే. నీవు సమకూర్చిన సౌకర్యాలన్నింటినీ లెక్కపెట్టవలెనన్న ఏ జీవితమూ చాలదు. మేము నిద్రమేల్కొని మాలో ప్రతి ఒక్కరి యోగక్షేమానికీ, పరిపోషణకు నీవు అన్ని ఏర్పాట్లు చేశావనే విషయాన్ని స్మరించి ఆనందిస్తాము. తల్లి దండ్రులు, భార్యా బిడ్డలు, సేవకుడు, చెలికాడు, సేవచేసేవారు అందరూ మన శక్తిసామర్థ్యాలను సరైన మార్గంలో అభివృద్ధిపరిచి ప్రకృతి క్రమంలో మనలను లీనం చేస్తున్నారు. ఈ అద్భుతాలన్నీ నీదయవలన కలిగినవే. ఇందుకు మేము మా హృదయపూర్వకమైన వందనాలను నీకు సమర్పిస్తున్నాము. నీ దృష్టిలో విశ్వాన్ని వీక్షించిన యెడల ఒక నిరంతర వ్యోమం సాగుతున్నట్లు గోచర మవుతుంది. సృష్టి అంతా ఒక ఆనందదాయకమైన యాత్రవంటిది. తల్లి తన శిశువును కౌగలించుకొనునట్లు, వైభవోపేతమూ, సౌందర్యవంతమూ అయిన సృష్టి మనలను తనలో ఇముడ్చుకుంటున్నది."

భగవంతుని యందుగల ప్రేమనుంచి ప్రభవిల్లిన ఆనందోత్సాహం చేతనూ, దైవికమైన శక్తిని గుర్తించడం వల్లను ఋషిసత్తములు ఈ సందేశం ఇచ్చివుంటారు. లేని యెడల సామాన్య మానవ రచనలలో అంతటి ఔన్నత్యం వుండదు.

బ్రహ్మర్షి వెంకటరత్నం గారిని దర్శించి వారి ఆశీస్సులు పొందే అదృష్టం నాకు కలిగింది. 1931 వ సంవత్సరంలో ఒక పర్యాయం వారి ఉపన్యాసం వినే భాగ్యం కూడా నాకు కలిగింది. కాని అప్పటికి నేను బాగా చిన్నవాణ్ణి కావడంచేత వారి ప్రసంగాన్ని అర్థంచేసుకోలేక పోయాను. వారి ఉపన్యాసాలను, బోధనలను, ప్రార్థనలను ఇప్పుడు శ్రద్ధతో అధ్యయనం చేయడంవల్ల నేను అపారమైన ప్రయోజనం పొందాను. మీరు నన్నీ మహాసభకు అధ్యక్షత వహించమని కోరని పక్షంలో వారి అమూల్యమైన రచనలను చవి చూచే సదవకాశం నాకు ఎప్పుడూ కలిగివుండేది కాదు. ఆయన జీవితం పరిశుద్ధమైన కావ్యం వంటిది. ఆయన ప్రవచనాలు కోహినూరువంటి మేటి వజ్రాలు కూడా సాటిరాని అమూల్యరత్నాలు. మిమ్ములను ఉద్దేశించి ప్రసంగించే ఈ అపూర్వమైన అవకాశం నాకు కలిగించినందుకు శతజయంత్యుత్సవ సంఘం వారికి మరొకసారి నేను కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

(బ్రహ్మర్షి వేంకటరత్నంనాయుడుగారి ఉపన్యాసముల సంపుటాల నుంచి, సూర్యనారాయణ రావుగారు రచించిన బ్రహ్మర్షి జీవిత చరిత్ర నుంచి ఈ ఉపన్యాసంలోని విషయాలు తీసుకోబడినవి).

# సంస్కృతి

**అవతారిక :**

ఆధునిక కళలో యువతరంవారి విప్లవాత్మక మనఃస్థితి కొంత గోచరిస్తుంది. నిరాశా నిస్పృహలు, ప్రాచీన కళపై, సంప్రదాయంపై కోపం – వీటివల్ల వికృత కళా రూపాల సృష్టికి దారితీయటం జరుగుతుంది; లేదా, నూత్న దృక్పథంవల్ల తమలో సాగుతున్న అంతర్యుద్ధానికి, ఉద్వేగానికి, అస్థిరతకు ప్రతీకలుగా ఉండే కల్పనలు చేయటం జరుగుతుంది. ఇది కూడా కళే అనిపించుకొంటుంది. ఎందుచేతనంటే, ఇందులో కూడా స్వేచ్ఛ, మానవత, ప్రకృతి విషయాలపై కళా సంబంధమైన ప్రతిక్రియ కనబడతాయి కాబట్టి. జాతీయం, ప్రాదేశికం అయిన పరిమితులను దాటి కళ క్రమంగా విశ్వజనీన మవుతున్నది. వాస్తవానికి ప్రాచ్య పాశ్చాత్యదేశాలు సన్నిహితా లవుతున్నాయి. ఈ దేశాల కళా సంస్కృతి రంగాల సమాగమంవల్ల ఒక నూత్న యుగావిర్భావం జరుగవచ్చు.

మనకు స్వాతంత్ర్య సిద్ధించిన తరువాత అనేక విధాలుగా వెనుకబడిన మన సంఘాన్ని ఆర్థికంగా, సాంఘికంగా, సాంస్కృతికంగా ఉన్నత స్థాయికి తీసికొని పోవాలని ప్రభుత్వమూ, ప్రజలూ శక్తి వంచన లేకుండా శ్రమిస్తున్నారు. ఇది అంత సులభసాధ్యమైన విషయం కాదు; చాల శ్రమతో కూడుకొన్న కృషి యిది. ఈ మహా ప్రయత్నంలో మనం సాంస్కృతిక విషయాలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వాలి. ఏమంటే, సాంఘిక మహా సౌధం నిర్మించాలంటే సంస్కృతియే దానికి గట్టి పునాది కావాలి. బలమైన నైతిక కళాదృష్టి లేకపోతే, ప్రజాస్వామ్య సిద్ధాంతంపై మనం నిర్మించబోయే నవ సమాజంలో ఉత్తమ పౌరులను తయారు చెయ్యలేము.

ఆంధ్ర ప్రదేశ్‌లో సాహిత్య, సంగీత, నాటక, లలితకళా అకాడమీలు మూడు ఏర్పడినాయి. సాంస్కృతిక వ్యవహారాలకు కూడా తగినంత ప్రోత్సాహ ప్రోద్బలాలు ఇవ్వాలనే సంకల్పంతో మన ప్రభుత్వం మన రాష్ట్రంలో సాంస్కృతిక వ్యవహారాల మంత్రిత్వ శాఖను క్రొత్తగా ఏర్పాటు చేశారు.

అయితే మన ఆదర్శాలకు అనుగుణంగా మన విద్యాలయాలలో చదువుతున్న యువతీ యువకులకు తర్ఫీదు ఇస్తున్నామా ? సౌందర్యానుభూతి, సత్యానుభూతి— వారు పొందటానికి అనువైన క్రమశిక్షణ ఇస్తున్నామా? అని ప్రశ్నించుకొంటే, 'ఇవ్వటం లేదు' అని నిజం చెప్పవలసి వస్తుంది. అన్ని పాఠశాలల్లోను, కళాశాల

ల్లోను, విశ్వవిద్యాలయాల్లోను కూడా నైతిక విద్య, కళాత్మక విద్య ఉపేక్షింప బడుతున్నాయి.

ఈ సమస్యపై ప్రధానంగా మన దృష్టి ఇప్పుడు కేంద్రీకరింప బడాలనీ, మన సంస్కృతీ సంప్రదాయాలకు అనుగుణమైన నవ విద్యావిధానం వెంటనే రూపొందింప బడాలనీ నేను చేసే ప్రతిపాదనతో సహృదయులందరూ ఏకీభవిస్తారని విశ్వసిస్తున్నాను.

## సంస్కృతి అంటే ఏమిటి ?

మానవజాతికి "సంస్కృతి" అనేది ఒక ఉన్నత లక్ష్యస్థానం. మానవ వ్యక్తిని జంతుకోటిలో ఒకటిగా నిర్వచించే పక్షంలో అతణ్ణి "సంస్కృతియోగ్యమైన జంతువు" అని పేర్కొనవలసి ఉంటుంది. కాని, సంస్కృతి యోగ్యమైన జంతువుగా నైనాసరే, జంతుకోటిలో ఒకడుగా పరిగణింప బడటం గౌరవహీనంగా భావిస్తాడు మానవుడు. దీనికి కారణం ఏ జంతువైనా సంస్కృతీమంతం కావటానికి జన్మతః అసమర్థమై ఉండటమే. జంతువుల బుద్ధి ప్రాకృతికమైనది ; కాని మానవుని బుద్ధి విచక్షణా సహితంగా ఉంటుంది. బాధ్యత-బాధ్యతారాహిత్యం, స్వాతంత్ర్యం-దాస్యం, స్వార్థం-స్వార్థరాహిత్యం, మంచి-చెడు—వీటిమధ్య అవకాశం కల్పిస్తుంది విచక్షణాజ్ఞానం. జంతువులకు ఈ మంచి చెడ్డల భేదంతో ప్రసక్తే ఉండదు ; కారణం : వాటి బుద్ధి ఆలోచనా శీలంగా ఉండదు కాబట్టి. మానవుని చేష్టలలో వలె జంతువుల ప్రవర్తనలో పాప పుణ్యాల భేదమే ఉండదు. మానవులుతమ ప్రవర్తనకు తాము బాధ్యత వహించినట్లు జంతువులు వాటి ప్రవర్తనకు అవి బాధ్యత వహించవు. మానవుని నరకం ఎంత అగాధాలలో ఉంటుందో, అతని స్వర్గం అంత మహోన్నత సీమలలో ఉంటుంది. మానవుడు నైతికంగా జంతువు కంటె పరమ అధోగతికి క్రుంగిపోనూ గలడు ; దేవతల కంటె అత్యున్నత స్థితిని అందు కోనూగలడు. మానవజాతి పురోగమించాలంటే భౌతిక శాస్త్రాలూ, నీతి శాస్త్రము కూడా మానవునిలోని భౌతిక లక్షణాలకు మానవతా లక్షణాలకు దోహదంచేయగల గాలి. ఇది జరగని పక్షంలో ప్రాణధారణదృష్ట్యా తానే జంతుప్రపంచానికి చెందిన వాడో ఆ జంతుప్రపంచంనుండి తన ప్రత్యేకతను నిరూపించుకొనే హక్కును మానవుడు కోల్పోతాడు.

ఇంతకూ ముఖ్యమైన ప్రశ్న "సంస్కృతి" అంటే ఏమిటి ? అన్నది. సంస్కృతి ఉభయాత్మకంగా ఉంటుంది. సౌజన్యం, దాక్షిణ్యం, నిస్స్వార్థం మొదలైనవి "సంస్కృతి" అనిపించుకొంటే, దౌర్జన్యం, నిర్దాక్షిణ్యం, స్వార్థం అనేవి "సంస్కృతి"

అనిపించుకొంటాయి అయితే ప్రతి పనిని ఆయా పరిస్థితులనుబట్టి విచారణ చెయ్యాలి. సంస్కృతీమంతుడైన వ్యక్తి తప్పక అట్లే చేస్తాడు. ఉదాహరణకు, దుష్టుడైన వ్యక్తి విషయంలో మనం సౌజన్యం చూపలేముగదా! అయితే ఒక్కొక్కప్పుడు శిక్షించి సాధించలేని ఫలితాలను దయాదాక్షిణ్యాలను చూపి సాధించడం జరుగవచ్చు. ఉన్న పరిస్థితులను ఆధారం చేసికొని, అహింసా సిద్ధాంతాన్ని జీవితానికి అన్వయించుకోవాలి. సంస్కృతీ రహితమై, దోపిడీ తత్త్వాన్ని ఆధారం చేసుకున్న సామ్రాజ్య వాదపు బంధనాలలోంచి తప్పుకొని బయట పడటానికి గాంధీజీ మానవతాయుతమైన రాజకీయాలతో సంస్కృతి సాధనాలైన సత్యాహింసలను సమన్వయించారు. ఇట్లు ఆ ఫలితాన్ని సాధించడం ఒక్క గాంధీజీకే చెల్లింది. రాజకీయాలను మానవతా పూర్ణంగా చేయడం ఇంతకుముందు రాజనీతికి విరుద్ధంగా భావించబడింది. కాని గాంధీజీ ఈ భావాన్ని రూపుమాపడంవల్ల మానవజాతి అభ్యుదయ రూపమే మారిపోయింది.

ప్రాక్తనదశనుండి ఆధునిక దశ వరకు మానవుని అభివృద్ధి మానవునిలోని ఉదారత, కరుణ, దయ, స్వార్థత్యాగం అనే గుణాలు క్రమంగా పరిణామం చెందిన విషయాన్ని సూచిస్తోంది. ఈ అభివృద్ధి జరగడానికి మానవునిపై మతానికి, తత్త్వశాస్త్రానికి గల ప్రభావమే కారణం. అయితే, మతమూ, తత్త్వ శాస్త్రమూ తరచు దుర్వినియోగానికి గురికావడం అప్పుడూ, ఎప్పుడూ కూడా ఉంటూనే ఉంది. అందువల్ల మానవుడు నైతికంగా పతనంకావడం జరుగుతూనే ఉంది. అయినప్పటికీ సర్వాంగీకృతమైన నైతిక దృష్టికే ఎప్పుడూ అంతిమ విజయం లభ్యమవుతుంది. మానవుణ్ణి వెనక్కి వెనక్కి అంధయుగాలలోకి తీసికొనిపోయే వేదాంతులు ఎల్లప్పుడూ ఉన్నారు; ఇకముందు కూడా ఉంటారు. నిన్న మొన్నటి ఉదాహరణలు ఫాసిజం, నాజిజం అనే వాటి విజృంభణ. ఇవి జాతి ఆధిక్యం, అసహిష్ణుత క్రూరత్వం, స్వార్థం అనే వాటిపై ఆధారపడ్డాయి. కాని ఇవి మానవజాతిని ఉద్ధరించే నవనైతిక తత్త్వాలుగా రూపొందింపబడ్డాయి. అదృష్టవశాత్తు, ఈ జీవన్మరణ సమస్యలో చివరకు మానవతయే పశుత్వం మీద విజయాన్ని సాధించింది. ఈ ఫలితం ఇటునుంచి, అటుతిరిగి ఉంటే మానవజాతి మనుగడ ఏమైపోయి ఉండేదో మనం ఊహించలేం.

## ఆదర్శవాదులు :

ఆదర్శవాదులు ప్రపంచంలో ఏయే మూలలలో ఉన్నా, వారిలో ఆశ్చర్యకరమైన విధంగా పోలికలు కనిపిస్తాయి. మతప్రవక్తలు, ఆదర్శవాదులు, తత్త్వ

వేత్తలు, రహస్యతావాదులు—వీరంవరు అంతర దృష్టితో సత్యసాధన చేసి, దురభిమానాదుల నుండి బయటపడి, నిర్మమతాయుతమైన గుణసంపత్తిని అలవర్చుకొన్నారు. విమర్శనాత్మక దృష్టిగల బుద్ధిమంతులు సైతం స్వార్థరహితమూ, స్వేచ్ఛాయుతమూ అయిన తమ ఆత్మశక్తిని వినియోగించి, దేశకాలానుగుణమైన సంకుచిత దృక్పథం నుండి విముక్తి పొందారు. తమకోసం, తమ లాభాలకోసం, తాపత్రయపడకుండా పరమార్థంకోసమో, ప్రజాసమూహంకోసమో – అది భగవంతుడైనా, ప్రజాశ్రేయస్సు అయినా – తాపత్రయపడి, మమకారం చూపేవారినే మానవజాతి ఆదర్శపురుషులుగా మన్నించింది.

## నిర్మమత్వం :

నిర్మమత్వంలో దాతృత, ధైర్యం, ఔదార్యం, వివేకం, నిర్లిప్తత మొదలైన సుగుణాలు ఇమిడి ఉన్నాయి. ఈ నిర్మమత్వాన్ని అన్ని మతాలవారు, పలువురు తత్త్వవేత్తలు బలపర్చడం జరిగింది. కొందరు తత్త్వవేత్తలు మాత్రం ఈ సుగుణాల్ని త్రోసిపుచ్చి క్రూరత్వం, హింస, భయం, అత్యాచారం మొదలైన వాటిని ఆధారం చేసుకొన్న ఒక తాత్త్విక దృక్పథాన్ని ప్రచారం చేశారు. వారు సత్యాన్ని కూడా సాపేక్షంగానే పరిగణించి, ఏదో ప్రయోజనం దృష్టిలో పెట్టుకొని, అసత్యాన్ని, అంటే, క్రమయుతమైన మిథ్యా ప్రచారాన్ని కూడా ఆకాశాని కెత్తి గౌరవిస్తారు. వీరు దేవుని స్థానంలో ఒక జాతినో, ఒక వర్గాన్నో, చివరకు ఒక నియంతనో నెలకొల్పి, ఇతర జాతుల శ్రేయస్సుకు భంగం కలిగిస్తారు. అయితే ఇప్పుడు, సత్ప్రయోజనాల్ని అసత్య మార్గాల ద్వారా సాధించగలమా అన్న ప్రశ్న ఉత్పన్నం అవుతుంది. కాని, సత్ప్రయోజనాలను సత్య మార్గాల ద్వారానే సాధించగలమని మనం విశ్వసిస్తామనడం లో నాకెలాంటి సందేహమూ లేదు. "సాధనాలు ఏవైనా ఫలితాలే ముఖ్యం" అనే నినాదం చాలా ప్రమాదకరమైంది. ఇది ఔద్ధత్యం, హింస, అసత్యం మొదలైన చెడుగుణాలకు దారితీస్తుంది.

## సౌందర్యం :

మానవతతోపాటు సంస్కృతిలో ఇంకో ముఖ్యమైన అంశం ఉంది. అది ప్రకృతిలోను, భావనలోను, భావవ్యక్తీకరణలోను ఉన్న సౌందర్యాన్ని ఆస్వాదించ గలగడం, మెచ్చుకోగలగడం. ధ్వని, ఆకృతి, వర్ణం, చలనం మొదలైనవి ప్రకృతి ప్రాథమిక ధర్మాలు—ఇవి ఆలోచనా శీలమూ సహజస్ఫురణాత్మకమూ అయిన మానవబుద్ధిచే అనుసంధానింపబడినప్పుడు బహుముఖ కళాద్వారములలో

వ్యక్తములై, పరమ సుందరములైన కళారూపములను స్వీకరిస్తాయి. ఇవి సంస్కృతీమంతమైన మానవబుద్ధికి శాశ్వత వికాసాన్ని, అనుసంధాన నిమగ్నతను కల్పించుటకు దోహదం చేస్తాయి. ఈ విధంగా మానవతపైగాని, మతముపైగాని ఆధారపడిన నీతిశాస్త్ర, సౌందర్యతత్త్వాలు మానవ జాతి యొక్క వెలలేని భాగధేయాలు. తరచు అజ్ఞాన ప్రమాదానికి లోనుకాగల ఆలోచనాశీలమైన బుద్ధిని మించి మానవబుద్ధి వికసించవలెనంటే మతాన్నిగాని, మానవతనుగాని అవలంబించి యున్న స్వార్థత్యాగం, సౌందర్యమగ్నత అనే వాటిని గాఢంగాను, విస్తారంగాను మానవ జాతి అలవర్చుకొనవలసి ఉంటుంది.

## సౌందర్యతత్త్వశాస్త్రం :

ముఖ్యంగా లలిత కళల విషయమై అంటే సౌందర్యతత్త్వాన్ని గూర్చి మన మిప్పుడు ముచ్చటించుకొందాము. ఈ సౌందర్యతత్త్వాన్ని గూర్చి అనేక సిద్ధాంతాలు ప్రచారంలో ఉన్నాయి. ఆధునిక సౌందర్యతత్త్వ సిద్ధాంతంపై ప్రముఖ పాశ్చాత్య రచయిత బెనిడెట్టో క్రోస్చే "కళా, దాని వివిధ రూపాలు సహజ స్ఫురణ శక్తికి పర్యాయరూపమైన వ్యక్తీకరణము యొక్క అంశములే" అని ఆయన పేర్కొన్నాడు. సహజ స్ఫురణశక్తి బుద్ధిమత్తకు, నైతిక భావనకు భిన్నమైనప్పటికీ అది వీటిపై అనుభవం కోసం, కళారూపమైన వ్యక్తీకరణ కోసం ఆధారపడి ఉంటుంది. దీనికి ఉదాహరణంగా కృష్ణ కర్ణామృతములోని క్రింది శ్లోకాన్ని గ్రహింప వచ్చు :

సాయంకాలే వనాన్తే కుసుమితసమయే సైకతే చంద్రికాయాం
త్రైలోక్యాకర్షణాంగం సురనరగణికా మోహనాపాంగమూర్తిం ।
సేవ్యం శృంగారభావై ర్నవరసభరితై ర్గోపకన్యాసహస్రై
ర్వన్దేఽహం రాసకేళీరత మతిసుభగం వశ్య గోపాలకృష్ణమ్ ॥
(తృతీయాశ్వాసం, 104 శ్లో.)

ఈ శ్లోకాన్ని, అందలి నైతిక విషయం వల్ల కాక భావనలోని, లేదా, సహజ స్ఫురణశక్తిలోని గొప్పదనం వల్లనే మనం మెచ్చుకొంటాము.

"కళ కళకోసమే" అన్న వాదాన్ని కొందరు అంగీకరించరు. జాన్ డ్యూయీ జీవితంలోని అంశాల కంటె కళ భిన్నమైనది అనే వాదాన్ని అంగీకరించడు. ఒక గీతంలోని భావం యొక్క సంపూర్ణత్వానికి గీతంలోవున్న పదాలు ముఖ్యం. కేవల నాదం సంగీతాన్ని అనుభవించడానికి, తద్వారా కలిగే అనుభూతిని పొందటానికి చాలదు. గానం జీవితంలోని సుఖాన్ని, లేదా, దుఃఖాన్నిగూర్చి ఏదో ఒక భావాన్ని

మనలో మేల్కొల్పుతుంది. అయితే ఇది ఎంతవరకు జరుగుతుంది? అన్నది మళ్ళీ బిన్నాభిప్రాయాలకు తావు ఇచ్చే సమస్య. నిత్యజీవిత సంఘటనలకే కళా రూపం ఇచ్చినప్పుడు అవి సౌందర్యమయాలుగా పరిణమిస్తాయనీ, వాస్తవికాంశాలను బట్టి శాస్త్ర ప్రవచనాలు ధ్రువపడటమో పడకపోవటమో జరుగుతుందనీ, కళాసృష్టి వాస్తవికాంశాలనూ కళాత్మకమైన అమూల్యా వస్తు జాలముగా మారుస్తుందనీ మరికొంద రంటారు. మాక్స్‌డెసాయిర్ అనే విమర్శకుడు సంప్రదాయంగా వస్తున్న "సౌందర్యతత్త్వ శాస్త్రం" (Aesthetics) అనే మాటకు బదులు "వైజ్ఞానిక కళా శాస్త్రం" (The General Science of Art) అని క్రొత్త పేరు పెట్టాడు. నైతిక సమస్యలను అనుసంధించే భాషాత్మక విభజన సిద్ధాంత ప్రాబల్యం వల్ల కళకు సంబంధించిన అర్థాన్నీ, సత్యాన్నీ ఒక కొత్త దృక్పథంతో చూడటం ఫలితంగా ఈ మార్పు వచ్చింది. తత్త్వశాస్త్రం, విజ్ఞానశాస్త్రం, మనస్తత్త్వశాస్త్రం, సాంఘికశాస్త్రం, మానవశాస్త్రం, సంస్కృతి, చరిత్ర, విమర్శ, విద్యాపద్ధతి — వీటన్నిటిని దృష్టిలో పెట్టుకొని కళలను, వాటికి సంబంధించిన ఇతర అంగాలను గూర్చి చేసే అధ్యయన మంతా సౌందర్య తత్త్వశాస్త్రానికి సంబంధించిందే అని "అమెరికన్ సొసైటీ ఆఫ్ ఈస్థటిక్స్" వారు పేర్కొన్నారు. ప్రాచీన సంప్రదాయానికి విరుద్ధమైన "వైజ్ఞానిక సౌందర్యతత్త్వశాస్త్రం" అన్న మాటకు ఈ నిర్వచనం సన్నిహితమైంది. ఈ నిర్వచనాన్ని పరిశీలించి చూస్తే, ఇందులో కాదన వలసింది ఏమీ లేదనిపిస్తుంది.

థామస్ మన్రో శాస్త్రీయదృక్పథంతో కళలను పరిశీలన చేసిన పండితుడు. ఆయన "శాస్త్రీయపంథాలో భావనకు, ప్రత్యుత్పన్న మతిత్వానికి ఎంతవరకు తావు ఉంటుందో చూపినాడు. ఈ పంథాలో—కళానిర్మాణంలో, కళాస్వాదనలో, కళా విమర్శలో — ఏమి ఇమిడి ఉన్నదన్న విషయాన్ని అధికంగా చర్చించటం కంటె తాను అవగాహన చేసుకొన్నదానిని అర్థవంతమైన కళాత్మక వస్తువుగా కల్పించడంలో నేర్పు సంపాదించటం ముఖ్యం. ఇతర సాధనలకు, కళలకు ఉన్న సంబంధం చక్కగా అవగాహన చేసి కొనడంవల్ల విశ్వవిద్యాలయాల్లోను, కళాశాలల్లోను భిన్న భిన్న కళాత్మక రచనలు ఇతోధికంగా వెలువడటానికి అవకాశం కల్పించబడింది. ఉన్నత పాఠశాలల్లోను, ప్రాథమిక పాఠశాలల్లోను కూడా కళాభివృద్ధికి ఎంతో దోహదం చెయ్యవలసిన అవసరం ఉంది."—(Colliers Encyclopaedia.)

## అలంకార శాస్త్రం :

భారతీయ సౌందర్య తత్త్వ శాస్త్రమునకు 'అలంకారశాస్త్రము' అని పేరు- భామహుడు, ఉద్భటుడు, రుద్రటుడు, దండి, వామనుడు అను కొందరు ప్రసిద్ధ

కెక్కిన అలంకారికులు — వీరందరూ ఆ శాస్త్రంలో ప్రాచీన సంప్రదాయమునకు చెందిన వారు. వీరి మతంలో కావ్యగౌరవం దోషము, గుణము, అలంకారము అనువాటినిబట్టి నిర్ణయింపబడుతుంది. వీటిలో అలంకారము సాహిత్యమునకు మాత్రము పరిమితం చెయ్యబడింది; పైగా అదే ముఖ్యంగా చెప్పబడింది. మిగిలిన గుణదోషము లన్నవి తర్క వ్యాకరణాలకు సంబంధించి భావసౌష్ఠవమును, శబ్ద సాధుత్వమును చెప్పేవి. ఇక్కడ కవితావస్తువుకంటే శబ్దార్థములకు అధిక ప్రాధాన్యం ఇవ్వబడింది. గుణములన్నవి కవిత్వానికి ఉత్కర్ష కలిగించేవి; ఇంక దోషములన్నవి కవిత్వానికి అపకర్ష కలిగించేవి.



ప్రాచీన సంప్రదాయమునకు భిన్నమైనది 'నవీన సంప్రదాయం.' దీనికి ప్రవర్తకుడు ధ్వన్యాలోక రచయిత అయిన ఆనందవర్ధనుడు. ధ్వన్యాలోకాన్ని వ్యాఖ్యానించినవాడు అభినవ గుప్తుడు. ఈ సంప్రదాయంలో వాచ్య వ్యంగ్యాలనుబట్టి కావ్యం విలువ నిర్ణయింపబడుతుంది. ఇందులో వ్యంగ్య వైభవం గల కావ్యానికే ఎక్కువ పరిగణన, ప్రాశస్త్యం వస్తాయి. గుణదోష వివేకం త్రోసిపుచ్చరానిదే; కాని వ్యంగ్య స్ఫురణ ఉన్నదా లేదా అన్నదే ప్రధానంగా పరిశీలింపతగ్గ విషయం అని వీ రంటారు. ఈ వ్యంగ్యం —వస్తుధ్వని, అలంకార ధ్వని, రసధ్వని— అని మూడు విధాలుగా ఉంటుంది. "భావనామయమైన, భవ్యావేశపరవశమైన హృదయం యొక్క ఆవిష్కారమే కవిత అన్నది వీరి దృక్పథం"—(Hiriyanna). శబ్దము వ్యంగ్యార్థమును సూచించువరకే ఆవశ్యకం. నిత్య వ్యవహార భాషవలె కాక, కవిత చెప్పదలచుకొన్న అర్థాన్ని ఆనంద సమ్మిళితం చేసి చెబుతుంది. ఇది శీలానికి కూడా మెరుగుపెడుతుంది. ఈ విధంగా కావ్యంలో 'రసం' ప్రధానం; అంతే కాదు, కావ్యానికి రసమే ఆత్మ. అందుచేతనే "వాక్యం రసాత్మకం కావ్యం" అన్నారు.



## వేదాంతం-సాంఖ్యం :



రస సిద్ధాంతాన్ని గూర్చి వేదాంతం, సాంఖ్యం—ఈ రెండూ రెండువిధాలు గా చెప్పాయి. విచార దృక్పథం కల సాంఖ్యాన్నిబట్టి ప్రకృతి సర్వాత్మనా సుందర మైనది కాదు. అందులో కొంత వికృతి కూడా ఉంది. ప్రకృతిగతములైన వస్తువులేవీ ఆనందప్రదాలు కావని కాదు. కాని ఆ శాస్త్రం చెప్పేదేమంటే—ప్రకృతి లో సర్వులకు సార్వకాలికమైన ఆనందాన్ని ఇచ్చేది ఏదీ లేదు. కాబట్టి శుద్ధమైన ఆనందం కావాలంటే ఈ వాస్తవిక జగత్తును వదలి వేరొకచోట వెదకాలి. ఇంక ఆనంద దృక్పథం కల వేదాంతం ఇల్లా చెబుతుంది: "ప్రపంచంలో ఉన్నదంతా

సౌందర్యమే. దాని అంతర్యా సామరస్యాన్ని భంగంచేసే దేమీ లేదు. ఆత్మవాదానికి ఇది మొదటిసూత్రం. ప్రకృతిసౌందర్యానికి తన్మయుడైపోయే యోగిని మించిన కళాహృదయుడే లేడు. అయితే మనం యోగివలె ప్రతి వస్తువులోను ఆత్మ పదార్థాన్ని చూడలేము; కాని ప్రకృతిలో ఉన్న కళాసౌందర్యాన్ని అప్పుడప్పుడు అనుభవిస్తుంటాము. అయినప్పటికి సాధారణంగా మన బుద్ధులు ఈ విశ్వసౌందర్యం పట్ల నిద్రాణంగానే ఉంటాయి అని చెప్పాలి. కళాహృదయుడెప్పుడూ ఆ విశ్వ సౌందర్యం వైపు చూడగల విశిష్ట దృష్టి కలవాడు కావటంచేత అతడు ఆ ఆనందాన్ని పొందుతూ, దాన్ని తాను చేపట్టిన కళారూపంలో వ్యక్తంచేస్తూ, మన కనుల్ని తెరిపిస్తుంటాడు. నిజానికి మనల్ని సర్వాత్మనా ఆకర్షించగల రూపం ధరించి వచ్చిన ప్రకృతియే కళ అని చెప్పాలి. ఈ పరిశీలనవల్ల తేలిందేమంటే పై రెండు దర్శనాల లక్ష్యమూ ఒక విధమైన నిర్లిప్తతను కలిగించడమే. వేదాంతాన్ని బట్టి చూస్తే కళా దృష్టి అన్నది తాత్కాలికంగానైనా వ్యక్తిత్వాన్ని మరచి పోయేటట్లు చేయడమే. సాంఖ్యం దీనినే వాస్తవిక జగత్తునుండి తప్పించుకొనడం అంటుంది. వేదాంతం దృష్ట్యా పరమార్థ లక్ష్యానికి కళ ఒక మార్గం. కాని, సాంఖ్యాన్ని బట్టి, వాస్తవికతనుండి తప్పించుకొనటానికి కళ ఒక మార్గం. నిజానికి కళాప్రయోజనం ప్రకృతిలో పరమోత్కృష్టమైనదాన్ని అవిష్కరించడం, ప్రకృతికంటె ఉత్తమమైన దాన్ని సృష్టించడం" — (Hiriyanna).

## నవరసాలు :

అలంకారశాస్త్రంలో మరొక మహాగ్రంథం జగన్నాథ పండితరాయలు రచించిన రసగంగాధరం. ఇది రససిద్ధాంతాన్ని సాకల్యంగా చర్చిస్తుంది. ఇందులో తొమ్మిది రసాలు క్రిందివిధంగా పేర్కొనబడ్డాయి :

"శృంగారః కరుణః శాన్తే రౌద్రో వీరోఽద్భుత స్తథా ।
హాస్యో భయానకశ్చైవ బీభత్స శ్చేతి తే నవ."

## కళాసృష్టి :

భారతీయ సిద్ధాంతాన్ని అనుసరించి, శ్రీ ఎస్. ఎన్. దాస్ గుప్త వివరించిన విధంగా, కళాఖండం ఆవిర్భవించడానికి కళాకారునిలో ఏడువిధములైన దశలు ఉంటాయి :

1. కళాకారుడు ప్రకృతిస్వరూపములను చక్కగా పరిశీలన చేయాలి.

2. ఆయా రూపాలలోని అంగాంగిభావ సామరస్యాన్ని జాగ్రత్తగా గమనించాలి.

3. వస్తువుకంటె భిన్నంగా, దాని పరిసర స్థితిగతులను గూర్చి విడిగా వివేచన చెయ్యాలి.

4. ఇంతకుముందు చేసిన కళాపరిశీలనవల్ల వాని జ్ఞాపకశక్తి సుశిక్షితం కావాలి.

5. మనఃఫలకమందు రూఢమైన రూపాన్ని కళాసముచితాలైన మాటలలో, రేఖలలో, రంగులలో, ఆకృతులలో, లేదా, ఇతర విధాలలో వ్యక్తం చేయగల కనులు, వ్రేళ్ళు కలిగి ఉండాలి.

6. అది తన సృష్టి అనిపించుకోగల ఆత్మీయతాముద్ర విస్పష్టంగా నిరూపించుకొనేటట్లు మననం చెయ్యాలి.

7. తన కళాతత్వార్థ మేమిటో సంపూర్ణంగా అవగాహన చేసికోవాలి.

భారతీయ కళాదృష్టిలో మరొక ప్రధానమైన అంశం కళాకారుడు నైతికదృష్టి కలవాడుగా ఉండాలి. నేను వెనుక చెప్పినట్లు ఈ లక్షణాలు ప్రతి కళాసృష్టికి—ప్రాచ్యమైనా, పాశ్చాత్యమైనా—తప్పక ఉండితీరవలసినవే. సంస్కృతీ సంప్రదాయాలు కొన్ని కొన్ని విషయాలలో భిన్నంగా ఉన్నా సర్వ సంస్కృతులు ప్రధాన విషయాలలో ఏకీభావం కలవిగానే ఉంటాయి.

## విశ్వజనీనత :

ఆధునిక కళలో యువతరం వారి విప్లవాత్మక మనఃస్థితి కొంత గోచరిస్తుంది. నిరాశా నిస్పృహలు, ప్రాచీన కళపై సంప్రదాయంపై కోపం—వీటివల్ల వికృత కళారూపాల సృష్టికి దారితీయటం జరుగుతుంది; లేదా, నూత్న దృక్పథంవల్ల తమలో సాగుతున్న అంతర్యుద్ధానికి, ఉద్వేగానికి, అస్థిరతకు ప్రతీకలుగా ఉండే కల్పనలు చేయటం జరుగుతుంది. ఇది కూడా కళే అనిపించు కొంటుంది; ఎందు చేతనంటే ఇందులో కూడా స్వేచ్ఛ, మానవత, ప్రకృతి విషయాలపై కళా సంబంధమైన ప్రతిక్రియ కనబడతాయి కాబట్టి. ప్రాదేశికం, జాతీయం అయిన పరిమితులను దాటి కళ క్రమంగా విశ్వజనీన మవుతున్నది. వాస్తవానికి ప్రాచ్య పాశ్చాత్య దేశాలు సన్నిహితా లవుతున్నాయి. ఈ దేశాల కళా సంస్కృతి రంగాల సమాగమంవల్ల ఒక నూత్న యుగావిర్భావం జరుగవచ్చు.

## కర్తవ్యం :

మనకు స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత అనేక విధాలుగా వెనుకబడిన మన సంఘాన్ని ఆర్థికంగా, సాంఘికంగా, సాంస్కృతికంగా ఉన్నత స్థాయికి తీసికొనిపోవాలని ప్రభుత్వమూ, ప్రజలూ శక్తివంచన లేకుండా శ్రమిస్తున్నారు. ఇది అంత సులభసాధ్యమైన విషయం కాదు; చాలా శ్రమతో కూడుకొన్న కృషియిది. ఈ మహా ప్రయత్నంలో మనం సాంస్కృతిక విషయాలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వాలి. ఏమంటే, సాంఘిక మహాసౌధం నిర్మించాలంటే సంస్కృతియే దానికి గట్టి పునాది కావాలి. బలమైన నైతిక కళాదృష్టి లేకపోతే, ప్రజాస్వామ్య సిద్ధాంతంపై మనం నిర్మించబోయే నవసమాజంలో ఉత్తమ పౌరులను తయారు చెయ్యలేము.

ఆంధ్రప్రదేశ్‌లో సాహిత్య, సంగీత, నాటక, లలితకళా అకాడెమీలు మూడూ ఏర్పడినాక, వీటికి తోడు సైన్సు అకాడెమీ, రవీంద్రభారతి కూడా ఉన్నాయి. బహుశః సైన్సు అకాడెమీ నెలకొన్నది ఒక్క మన ఆంధ్రప్రదేశ్‌లోనే అనుకొంటాను. శాస్త్రవిజ్ఞానాన్ని అందరికీ అందుబాటులోకి తేవడానికీ, ప్రజల్లో విజ్ఞానాత్మక శాస్త్ర దృష్టిని కలిగించడానికీ ఈ సైన్సు అకాడెమీ కృషి చేస్తుంది. దీని స్థాపనకు విద్యామంత్రి శ్రీ పి.వి.జి. రాజుగారు చేసిన కృషి గణనీయం. సాంస్కృతిక వ్యవహారాలకుకూడా తగినంత ప్రోత్సాహ ప్రోద్బలాలు ఇవ్వాలనే సంకల్పంతో మన ముఖ్యమంత్రి మన రాష్ట్రంలో సాంస్కృతిక వ్యవహారాల మంత్రిత్వ శాఖను క్రొత్తగా ఏర్పాటు చేశారు.

అయితే మన ఆదర్శాలకు అనుగుణంగా మన విద్యాలయాలలో చదువుతున్న యువతీ యువకులకు తర్ఫీదు ఇస్తున్నామా ? సౌందర్యానుభూతి, సత్యానుభూతి వారు పొందటానికి అనువైన క్రమశిక్షణ ఇస్తున్నామా ? అని ప్రశ్నించుకొంటే 'ఇవ్వటంలేదు' అని నిజం చెప్పవలసి వస్తుంది. అన్ని పాఠశాలల్లోను, కళాశాలల్లోను, విశ్వ విద్యాలయాల్లోను కూడా నైతికవిద్య, కళాత్మకవిద్య ఉపేక్షింపబడుతున్నాయి.

ఈ సమస్యపై ప్రధానంగా మనదృష్టి ఇప్పుడు కేంద్రీకరింపబడాలనీ, మన సంస్కృతీ సంప్రదాయాలకు అనుగుణమైన నవ విద్యా విధానం వెంటనే రూపొందింపబడాలనీ నేను చేసే ప్రతిపాదనతో సహృదయులందరూ ఏకీభవిస్తారనీ విశ్వసిస్తున్నాను.

# ఆంధ్రజాతి సంస్కృతీ చరిత్ర

## భాష :

భాషను గూర్చి వివరించటంతో ఆరంభంచేస్తాను. తెలుగులో ఆర్య-ద్రావిడ భాషా-సారస్వతాల అంశాలు రెండూ ఉన్నాయి. వీటినే మార్గ-దేశీభేదాలంటారు. 'మార్గ' అనేవి సంస్కృత జన్యం; కాగా ఆర్యసంబంధి. 'దేశి' అనేది దేశీయ మైనది; కాగా ద్రావిడ సంబంధి. ఈ భాషాభివృద్ధిలో పై రెండు అంశాలు పెన వేసికొని ఉన్నాయనటానికి నిదర్శనం ఈ భాషకు రెండు పేర్లు ఉండటమే—ఒకటి ఆర్య సంబంధి పదమైన 'ఆంధ్రము;' ఇంకొకటి ద్రావిడ సంబంధి పదమైన 'తెలుగు.' తెలుగు "సంశ్లిష్ట" భాష. ఇందులో ప్రాతిపదికకు విభక్తి చేరిస్తే చాలు, అసలు ప్రాతిపదికలో ఎట్టి మార్పు ఉండదు. సంస్కృత ప్రాతిపదికలకు డు, ము, వు, లు అనే తెలుగు విభక్తులు చేరిస్తేచాలు, అవి తెలుగు పదాలైపోతాయి.

ఆంధ్రము లేదా తెలుగు అజంతభాష కావటంచేతా, శబ్దాలలోని మాధుర్యం వల్లా దీన్ని 'ప్రాగ్దేశపు ఇటలీ భాష' (Italian of the East) అంటారు. అంతే కాదు, గాత్ర సంగీతానికి ఈ భాష ఎంతో అనుకూలం. తమిళ దేశంలో, కన్నడ దేశంలో వ్యవహారంలో ఉన్న శాస్త్రీయ కర్ణాటక సంగీత కృతులలో అధికభాగం తెలుగుభాష లోనే ఉండటం గమనార్హం. సంగీతధర్మమైన మాధుర్యగుణం కలిగిన దవటం చేతా, సంస్కృత పదాలను సులువుగా తనవిగా చేసికోగల శక్తి కలిగినదవటంచేతా ఆధునిక వైజ్ఞానిక భావాలను వ్యక్తం చేయటానికి భారతీయభాష లన్నింటిలోను తెలుగు భాషయే ఎక్కువ అనుకూలమైనదని పాశ్చాత్య విద్వాంసుడు ఆచార్య జె. బి. ఎస్. హాల్డేన్ పేర్కొన్న విషయం విజ్ఞులందరకూ తెలిసిందే.

## చరిత్ర :

'ఆంధ్ర' అనే పదం ప్రప్రథమంగా ఐతరేయ బ్రాహ్మణంలో కనిపిస్తోంది. అశోకుని తరువాత ప్రసిద్ధికి వచ్చిన సాతవాహనుల (లేదా, శాలివాహనుల) కాలం నుంచీ ఆంధ్రులచరిత్ర క్రమవికాసం తెలియ వస్తోంది. నాలుగు శతాబ్దాలపాటు ఆంధ్రదేశాన్ని పరిపాలించిన సాతవాహనులు బౌద్ధులు. మంచి ఉచ్చదశలో ఉన్నప్పుడు ఈ ఆంధ్ర చక్రవర్తుల సామ్రాజ్యం దక్కను పీఠభూమి అంతా వ్యాపించటమే కాక కొంతవరకు ఉత్తర హిందూస్థానానికి, అధికంగా తమిళదేశానికీ

కూడా వ్యాపించింది. తొలి సాతవాహన చక్రవర్తి అయిన శ్రీముఖ సాతవాహనుడు నేటి గుంటూరు జిల్లాలోని అమరావతి రాజధానిగా క్రీ. పూ. 225 నుంచి క్రీ. పూ. 202 వరకు పరిపాలించాడు. అటుపిమ్మట పరిపాలకులైన సాతవాహన రాజులలో క్రీ. శ. 78 నుంచి 102 వరకు పరిపాలన చేసిన గౌతమీపుత్ర శాతకర్ణి చాలా శక్తిమంతుడైన చక్రవర్తి సాతవాహన చక్రవర్తుల కాలంలో ఆంధ్ర సామ్రాజ్యం మంచి ఉచ్ఛదశలో ఉండి, శాంతి సౌభాగ్యాలతో తులతూగింది. వివేకవంతులైన ఈ ఆంధ్ర చక్రవర్తుల ఆదరాభిమానాలవల్ల ఆనాడు కళలు, సాహిత్యం, వాణిజ్యం, మతం బాగా పెంపొందాయి. సుప్రసిద్ధ సాతవాహన చక్రవర్తి అయిన హాలుడు 'గాథా సప్తశతి' ని కూర్చినాడు. తెలుగు గడ్డమీద ప్రభవించిన తొలి కావ్యం "గాథా సప్తశతి.' సాతవాహనుల మంత్రి అయిన గుణాఢ్యుడు 'బృహత్కథ' ను రచించాడు. ప్రాకృత సాహిత్యంలో ఈ రెండు గ్రంథాలు చాలా ప్రామాణిక రచనలు.

ప్రాకృత భాషాలాలిత్యం, గాథల కమనీయత తెలియటం కోసం గాథాసప్తశతినుంచి ఒకటి రెండు ఉదాహరణలు :

అ ఉలీణో దోమూహజో తా మహురో భో అణం ముహే జావ!

మురజో వ్వ ఖలో జిణ్ణమ్మి భో అణే వర సమారసఇ॥ [III-53]

—ముఖమున బోనమున్నంత వరకే మద్దెల మధురముగా పలుకును; అది పోగానే విరసముగా మొఱగును. అట్లే ఖలుడు ద్విజిహ్వుడై అన్నము తిను చున్నంతసేపు మధురముగా పలుకును; అది జీర్ణము కాగానే విరసముగా పలుకును!

ఒక హాస్యమట్టము :

పాఅపడిఅస్స పఇనో పుట్టిం పుత్తే సమారుహత్తమ్మి ।

దడమణ్ణుదుణ్ణి ఆఏ విహాసో మరీణిఏ ణిక్కంతో ॥ [I-11]

—అలుక మానుమని వేడుచు ఇల్లాలి పాదముల యందు పడియున్న పతి వీపుమీద పుత్రుడెక్కి కేరింతాలు కొట్టుచుండగా ఎంత కోపంతో ఉన్నప్పటికీ ఆ ఇల్లాలు నవ్వు ఆపుకొనలేక పోయింది!

సాతవాహన సామ్రాజ్య పతనానంతరం ఆంధ్రదేశం ఛిన్నాభిన్నమైంది. వేర్వేరు ఆంధ్ర భూభాగాలను ఇక్ష్వాకులు, సాలంకాయనులు, విష్ణుకుండినులు,

పల్లవులు, వాకాటకులు, బాదామిచాళుక్యులు ఆయా కాలాలలో పరిపాలించారు. విజయపురి రాజధానిగా క్రీ. శ. 220 నుండి 260 వరకు కొనసాగిన ఇక్ష్వాకు రాజుల పరిపాలనా కాలంలో, అచ్చట, సుప్రసిద్ధాలైన బౌద్ధస్తూపాలు, విహారాలు, విశ్వవిద్యాలయం నిర్మింపబడ్డాయి. మహాయాన బౌద్ధమత ప్రవక్త అయిన ఆచార్య నాగార్జునుడు అచ్చటనే వర్ధిల్లినాడు. ఈ స్తూపాలు, విహారాలు రాణులైన శాంతిశ్రీ, హమ్మసిరినికలచే నిర్మింపబడ్డాయి. ఇక్ష్వాకు రాజులలో శాంతిమూలుడు, వీర పురుషదత్తుడు వైదికమతావలంబులై అశ్వమేధయాగాలు చేశారు. క్రీ.శ. 7వ శతాబ్దిలో, తూర్పు సముద్రతీర ప్రాంతంలో, గోదావరీ మండలంలో తూర్పుచాళుక్యుల సామ్రాజ్యం వెలసింది. రాష్ట్రకూటులు, చివరి చాళుక్యులు తెలంగాణా ప్రాంతాన్ని పరిపాలించారు. తూర్పుచాళుక్య చక్రవర్తి అయిన రాజరాజ నరేంద్రుడు రాజమహేంద్రవరం (నేటి రాజమండ్రి) రాజధానిగా క్రీ.శ. 1062 వరకు పరిపాలించాడు. మనకు లభించిన తొలి తెలుగు కావ్యం రాజరాజ నరేంద్రుని ఆస్థాన కవియైన నన్నయభట్టుచేత రచింపబడింది. అటుపిమ్మట, వరంగల్లు రాజధానిగా పరిపాలన చేసిన కాకతీయులు ప్రసిద్ధికి వచ్చారు. క్రీ.శ. 1198 నుంచి 1261 వరకు పరిపాలించిన కాకతీయ గణపతిదేవుడు సముద్రతీర ప్రాంతాన్ని, రాయలసీమను జయించి, తెలుగు ప్రజలందర్నీ తన ఏలుబడిలోనికి తెచ్చినాడు. పిమ్మట ఆయన కుమార్తె రుద్రాంబ (క్రీ. శ. 1261–1296) ఆటు తరువాత ఆమె మనుమడు ప్రతాపరుద్రదేవుడు (క్రీ.శ. 1296–1323) కాకతీయ సామ్రాజ్యాన్ని పరిపాలించారు. క్రీ.శ. 1323 లో మహమ్మద్ బిన్ తుగ్లక్ ప్రతాపరుద్రదేవుని సింహాసన భ్రష్టుని చేయటం సంభవించింది. కాకతీయుల పరిపాలనలో శాంతి సౌభాగ్యాలు విలసిల్లినాయి. కళలు, సాహిత్యం పెంపొందాయి. కాకతీయ ప్రతాపరుద్రుని ఆస్థాన కవియైన విద్యానాథుడు రచించినదే నేటికీ భారతదేశమంతటా పఠనపాఠన వ్యవహార ప్రసిద్ధిలోనున్న అలంకారశాస్త్ర గ్రంథం "ప్రతాపరుద్ర యశోభూషణం."

కొందరు సుప్రసిద్ధులైన ఆంధ్రవీరులు తుగ్లక్ జయించిన భూభాగాలను స్వతంత్రం కావించారు. తత్ఫలంగా రెడ్డిరాజులు కొండవీటి రాజ్యాన్ని, వెలమదొరలు రాచకొండ రాజ్యాన్ని, హరి హర బుక్కరాయలు విజయనగర రాజ్యాన్ని పరిపాలించసాగారు. క్రీ.శ. 1345 లో బహమనీ రాజ్యం పశ్చిమ దక్కన్ పీఠభూమిలో స్వతంత్ర ముస్లిం రాజ్యంగా నెలకొన్నది. స్వతంత్ర ప్రతిపత్తి కోసం ఈ రాజ్యాలన్నింటి మధ్య నిరంతరం పోరు కొనసాగుతూనేఉండేది. క్రీ.శ. 16వ శతాబ్ది ప్రథమ పాదంలో బహమనీ రాజ్యం పతనమైన పిమ్మట చిన్న చిన్న ముస్లిం

సంస్థానాలేర్పడ్డాయి. గోల్కొండ, అంటే, నేటి హైదరాబాదు రాజధానిగా కుతుబ్ షాహీ వంశస్థులు రాజులైనారు. గోల్కొండ రాజ్యము క్రీ.శ. 1520 లో స్థాపింపబడింది.

ఆదిలో ఒక చిన్న రాజ్యంగా మొదలైన విజయనగర రాజ్యం పిమ్మట మహాసామ్రాజ్యంగా వెలసింది. క్రీ.శ. 1509 నుంచి 1529 వరకు పరిపాలన చేసిన శ్రీకృష్ణదేవరాయల కాలంలో విజయనగర సామ్రాజ్యం చాలా ఉచ్ఛస్థితికి వచ్చింది. రాయల కాలంలోనే తెలుగు సాహిత్యం క్రొత్తదారిని త్రొక్కింది. ఆనాటి వరకు అనువాదాలే అధికంగా కొనసాగుతూ వచ్చాయి. అందులకు భిన్నంగా ఆనాటి కవులు తమ ఇష్టానుసారం కావ్యరచన చేయుటం ఆరంభించారు. శ్రీకృష్ణదేవరాయల కొలువులో 'అష్టదిగ్గజాలు' అనే పేరుతో ఎనిమిది మంది ప్రఖ్యాత కవులు ఉండేవారు. వీరిలో 'మనుచరిత్ర' రచించిన అల్లసాని పెద్దన అగ్రగణ్యుడు. విజయనగర సామ్రాజ్యం క్రీ. శ. 1336 నుండి 1564 వరకు వర్ధిల్లినది.

'రక్కస్–తంగడి' యుద్ధంలో అళియ రామరాయలు చనిపోవటంతో విజయనగర సామ్రాజ్యం ఛిన్నాభిన్నమైంది. విజయనగర సామ్రాజ్య పతనానంతరం ఆంధ్రదేశం క్రమంగా గోల్కొండ కుతుబ్‌షాహీల ఆధిపత్యంలోకి వచ్చింది. కుతుబ్ షాహీలకాలంలోనే ఫ్రెంచి, డచ్, ఇంగ్లీషు వర్తకులు తూర్పు కోస్తా ఆంధ్ర ప్రాంతాలైన మద్రాసు, మచిలీపట్టణం, భీమిలిపట్టణం మొదలైన చోట్ల వ్యాపార స్థావరాలేర్పరచుకొన్నారు. క్రీ.శ. 1687 లో ఔరంగజేబు గోల్కొండ కుతుబ్ షాహీలను జయించాడు. ఆనాటినుంచి ఆంధ్రదేశంలోని 'తెలంగాణా' ప్రాంతం 'నైజాములు' అని పిలువ బడే అసఫ్‌జాహీ పాలకుల పరిపాలనక్రిందకు వచ్చింది; అప్పటి పరిపాలకుడు నైజామ్-ఉల్-ముల్క్. అసఫ్ జాహీల పరిపాలన క్రీ.శ. 1723 లో ఆరంభమై, క్రీ. శ. 1956 లో 'ఆంధ్రప్రదేశ్' ఏర్పడే పర్యంతం కొనసాగింది. నైజాము, ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు, మహరాష్ట్రులు, మైసూరుకు చెందిన టిప్పుసుల్తాన్—వీరి మధ్య జరిగిన సంఘర్షణలు కారణంగా ఒక ముప్పై సంవత్సరాల కాలంలో ఆంధ్ర భూభాగం ఆక్రమణ విషయంలో అనేకాలైన మార్పులు వచ్చాయి. చివరకు క్రీ.శ. 19వ శతాబ్ది ప్రారంభంలో రాయలసీమ, కోస్తా జిల్లాలు బ్రిటిష్ సామ్రాజ్యం ఆధిపత్యం క్రిందకు వచ్చేశాయి.

ఆంధ్రరాజుల కాలంలో వైదిక-బౌద్ధ మతాలు ఆదరింపబడ్డాయి. విజయనగర సామ్రాజ్యం ఆవిర్భవించిన పిమ్మట హిందూ స్వాతంత్ర్యం, హిందూ నాగరకత సంరక్షింపబడుతూ వచ్చాయి. ఇంతకుముందే పేర్కొన్నట్లుగా సాతవాహన రాజుల

కాలంలోను, ఇక్ష్వాకుల కాలంలోను ఆంధ్రదేశంలో బౌద్ధమతంకూడా వర్ధిల్లింది. ఆంధ్రులు ప్రయోగ దృష్టియందలి ఔత్సుక్యంతో క్రొత్త క్రొత్త ఉద్యమాలన్నింటినీ ముందుగా చేపట్టేవారుగా కనిపిస్తారు. ప్రపంచమంతటా బౌద్ధమతంమీద విస్తృతమైన ప్రభావాన్ని చూపిన మహాయాన సిద్ధాంతాన్ని ఆచార్య నాగార్జునుడు వెలయింపజేశాడు. బౌద్ధమత విషయంలో ఘంటసాల, భట్టిప్రోలు, అమరావతి, నాగార్జున కొండ—ఇవి అంతర్జాతీయ ప్రసిద్ధిని పొంది, విశ్వవిఖ్యాత యాత్రాస్థలాలైనాయి.

## వాస్తుకళ :

వాస్తు కళా క్షేత్రములో ఆంధ్రులు అపూర్వ నిర్మాణాలకు సృష్టికర్తలైనారు. "నాలుగు ఆయక వేదికలను కలపటం చక్కని శిల్పాలతో కూడుకొన్న చలువరాతి పలకలతో ఇటుక కట్టడాలను పూరించటం ఆంధ్రుల ప్రత్యేకత; ఇవి స్తూపాలకు గంభీరతను, అందాన్ని చేకూర్చాయి. అమరావతి మహా "చైత్యమందలి చలువ రాతి పలకల వరుసలు, ప్రఖ్యాతమైన సాంచీ స్తూపమందలి తోరణాలు బౌద్ధ వాస్తుకళ చరిత్రలో అపూర్వ నిర్మాణాలు."

"విజయపురి ఇక్ష్వాకులు దేవాలయ నిర్మాణోద్యమాన్ని చాలా పట్టుదలతో ప్రారంభించారు. పల్లవులు ఆ ఉద్యమాన్ని కొనసాగించి, అభివృద్ధి పొందించారు. విష్ణుకుండినులు బౌద్ధుల గుహారామ వాస్తుకళను అనుకరించారు. హిందూ దేవతలకు అంకితాలైన పెక్కు గుహాలయాలను త్రవ్వించి వెలికి తీయించారు. పల్లవులు ఈ పద్ధతినే పాటించి, దీన్ని దక్షిణ హిందూదేశంలో అభివృద్ధి పరచారు. ఆంధ్రదేశానికి సంబంధించిన ఈ ద్వివిధమైన సంప్రదాయం ప్రఖ్యాతమైన మహాబలిపురం రాతిరథాల రూపంలో మనీభవించింది."

"దేవాలయ వాస్తుకళకు సంబంధించిన నగర, వేసర, ద్రవిడ అనే ప్రధాన శైలులు మూడున్నూ ఆంధ్రదేశంలో చాళుక్యుల కాలంలో ఆదరణ పొందాయి. వేసర శైలికి పరాకాష్ఠ అని చెప్పబడే వక్రరేఖావృతమైన గోపురం, అమలక శిఖరం—ఇవి కలిగిన వేసరశైలి దేవాలయాలు ఆంధ్రదేశంలో మూడుచోట్ల కనబడుతున్నాయి. తరువాతి చాళుక్యుల కాలానికి సంబంధించిన వాస్తుకళా శైలులను కాకతీయులు అవలంబించి, పెక్కు క్రొత్త పోకడలను మిళితంచేసి తెలంగాణాలోని వరంగల్లు జిల్లాలో ఉన్న హనుమకొండ, రామప్ప మున్నగు ప్రదేశాలల్లో సుందరములైన పెక్కు కట్టడాలను వెలయింపజేశారు."

"మధ్యయుగానికి చెందిన దక్కను చరిత్రలో ఈ దేవాలయాలు హిందూ వాస్తుకళకు పరాకాష్ఠ అని చెప్పవచ్చు. ప్రసిద్ధులైన విజయనగర చక్రవర్తులు

ఒక క్రొత్త దేవాలయ నిర్మాణ శైలిని కనుగొన్నారు. ఈ శైలికి సంబంధించిన స్వచ్ఛమైన కట్టడాలను రాయలసీమ జిల్లాలలో చూడవచ్చు."

—మారేమండ రామారావు

పురాతనాలైన ఇట్టి కట్టడాలను దక్షిణ దేశంలో వెల్లూరు, తంజావూరు, మధుర, జింజి, పుదుక్కోట మొదలగు ప్రాంతాలలో కూడా చూడవచ్చు. విజయనగర సామ్రాజ్య పతనానంతరం తంజావూరులో తెలుగు నాయకరాజులైన రఘునాథ నాయక, విజయరాఘవ నాయకులు, మధురలో విజయరంగ చొక్కనాథుడు, పుదుక్కోటలో రాజా రఘునాథుడు స్వతంత్రులైనారు.

క్రీస్తుశకారంభంలో, అంటే, సాతవాహన రాజుల కాలంలో ఆంధ్రులు కొందరు ఆగ్నేయ ఆసియా దేశాలకు వలస వెళ్ళారు. ఆయా దేశాలలో కనుపట్టే అమరావతి, విజయపురి, సింహపుర, కళింగ మున్నగు స్థల నామాలు ఆంధ్రులు వలస వెళ్ళారనడానికి తార్కాణాలు. శక సంవత్సరాలలో ఈయబడిన తేదీలుకల శాసనాలు, క్రీస్తు శకారంభ శతాబ్దాలకు చెందిన తెలుగు లిపిలో వ్రాయబడిన శాసనాలు, అమరావతి శైలికి చెందిన శిల్పాలు ఈ దేశాలలో కనుగొనబడ్డాయి.

## జాతీయోద్యమం :

జాతీయ స్వాతంత్ర్య సమరంలో ఆంధ్రుల దెల్లప్పుడూ ముందంజయే. క్రీ.శ. 1885 లో 'ఇండియన్ నేషనల్ కాంగ్రెస్' ఉద్భవించటంతో జాతీయ మహోద్యమం ఆరంభమైంది. భారతీయ సైనికుల తిరుగుబాటుతో క్రీ.శ. 1857 లోనే నిజంగా స్వాతంత్ర్య సమరం ఆరంభమైనదన్న సత్యం మనకందరకూ తెలుసు. ఈ సైనికుల తిరుగుబాటును తాంతియాతోపే, ఝాన్సీరాణి మున్నగు జాతీయ మహాయోధులు బలపర్చటంతో సైనికుల తిరుగుబాటు 'స్వాతంత్ర్యసమర' రూపంతాల్చింది. తరువాతి పరిశోధనలను బట్టి భారతదేశంలో బ్రిటిషువారి అధికారం స్థిరపడినప్పటినుంచి స్వాతంత్ర్యంకోసం సమరం సాగుతూనే ఉన్నదని తెలుస్తోంది. కృష్ణా జిల్లాలోని నూజివీడుకు చెందిన నారయప్పారావు, దక్షిణ దేశానికి చెందిన పాండ్య సరదారు కట్టబొమ్మ (ఇతడు కూడా ఆంధ్రుడే)—ప్రసిద్ధులైన ఈ ఇరువురు సరదార్లు 18 వ శతాబ్ది రెండవభాగంలో బ్రిటిషువారిని ఎదిరించి పోరాడినారు. క్రీ.శ. 1783 లో నారయప్పారావు ఈస్టుఇండియా కంపెనీ వారి అధికారులతో పోరాటం సాగించాడు. ఆయన కుమారుడు రామచంద్ర అప్పారావు కూడా ఈ పోరాటం కొనసాగించాడు. చివరకు నూజివీటి అప్పారావుతో

బ్రిటిషువారు సంధిచేసికొన్నారు. క్రీ.శ. 1795 లో కట్టబొమ్మ ఈస్టుఇండియా కంపెనీకి వ్యతిరేకంగా తిరుగుబాటు సాగించాడు. కాని దురదృష్టవశాత్తు నమ్మిన వారిచేత మోసగింపబడి, బ్రిటిషువారికి చిక్కి, కట్టబొమ్మ ఉరితీయబడినాడు. భారతీయ స్వాతంత్ర్యసమరం ఆరంభంకావటానికి ఇంచుమించుగా 75 సంవత్సరాలకు ముందే ఈ సరదార్లు ఇరువురు బ్రిటిషువారిపై తిరుగుబాటుకు మార్గదర్శకులైనారు.

## ఆంధ్రోద్యమం :

భాష ప్రాతిపదికగా రాష్ట్రాల పునర్విభజన జరగాలన్న ముఖ్యాశయంతో క్రీ.శ. 1913 లో ఆంధ్రోద్యమం ఆరంభమైంది. ఈ విషయంలో తక్కిన రాష్ట్రాల వారికి ఆంధ్రులే మార్గదర్శకులు. ప్రత్యేక రాష్ట్ర కాంగ్రెస్ సంఘం కావాలన్న ఆంధ్రుల కోర్కెను క్రీ.శ. 1917 లో భారత జాతీయ కాంగ్రెస్ అంగీకరించింది. ప్రత్యేకరాష్ట్ర వాంఛ ఆంధ్రులలో ఎల్లప్పుడు ప్రబలంగానే ఉంటూ వచ్చింది. ఈ ఆందోళన ఫలితంగానే క్రీ.శ. 1926లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నెలకొల్పబడింది. నాటినుంచి క్రీ.శ. 1950 వరకు భాషాప్రయుక్త రాష్ట్ర విభజన సమస్య మద్రాసురాష్ట్ర శాసనసభలోను, కేంద్ర శాసనసభలోను చర్చింపబడుతూనే ఉంది. స్వరాజ్యం సిద్ధించిన పిమ్మటనే భాషాప్రయుక్త రాష్ట్ర విభజన సమస్య చేపట్టాలని క్రీ.శ. 1936 లో జాతీయ కాంగ్రెస్ నిర్ణయించింది.

క్రీ.శ. 1947 లో స్వాతంత్ర్యం సిద్ధించిన పిమ్మట ఆంధ్రరాష్ట్ర విభజన జరగాలని కాంగ్రెస్‌పై వత్తిడి తీసికొని వచ్చారు ఆంధ్ర నాయకులు. భాషాప్రయుక్త రాష్ట్ర విభజన సమస్యపై సమగ్రమైన ఒక నివేదిక సమర్పించటం కోసం పండిత జవహర్‌లాల్ నెహ్రూ, సర్దార్ వల్లభభాయ్ పటేల్, డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యలతో కూడుకొన్న ఒక ఉపసంఘాన్ని జైపూర్ సభల సమయంలో ఏ.ఐ.సి.సి. నియమించింది. 'జె.వి.పి. రిపోర్టు' అనే పేర ప్రసిద్ధి కెక్కిన ఈ ఉపసంఘ నివేదికలో ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణం సిఫారసు చేయబడింది. ఈ ఉపసంఘ నియామకానికి ముందే జస్టిస్ థార్ అధ్యక్షతలో ఒక సంఘం నియమింపబడింది. ఈ సంఘం భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన సూత్రాన్ని వ్యతిరేకించినప్పటికీ ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమస్యను ప్రత్యేకంగా ఆలోచించాలని సిఫారసు చేసింది. అయినప్పటికీ ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణం విషయంలో ఎట్టి చర్య తీసికోబడలేదు. చివరకు క్రీ.శ. 1949 లో ప్రత్యేకాంధ్ర

రాష్ట్ర నిర్మాణ విషయంలో కచ్చితమైన సూచనలు చేయటంకోసం ఒక విభజన సంఘాన్ని కేంద్ర ప్రభుత్వం నియమించింది. క్రీ. శ. 1950 లో ఈ సంఘం తన నివేదికను సమర్పించింది. 1950 జనవరి 26 వ తేదీనాటికి ప్రత్యేకాంధ్ర రాష్ట్రం ఏర్పడగలదని అందరూ ఆశించారు. కాని, ప్రత్యేకాంధ్రరాష్ట్రం నిర్మాణం వాయిదా వేయబడిందని కేంద్ర ప్రభుత్వం ప్రకటించడంతో అంతటా నిరాశ అలముకొంది.

ఇట్టి సమయంలో పొట్టి శ్రీరాములు ఆంధ్రరాష్ట్ర నిర్మాణం కోసం అమరణ దీక్షను పట్టారు. ఈ ఉపవాస దీక్షతో ఆంధ్రులలో అలజడి, అశాంతి అధికమైనాయి; ఆంధ్రరాష్ట్రం ఏర్పడనిదే ఆంధ్రులు తృప్తి చెందరన్న విషయం స్పష్టమైంది. చివరకు పొట్టి శ్రీరాములు ఆత్మాహుతి అయినారు. అమరణ ఉపవాస దీక్ష పట్టి, ఆత్మాహుతి అయిన ముప్పురు ప్రపంచ ప్రఖ్యాత వ్యక్తులలో శ్రీరాములు ఒకరు అయినారు. ఈ ఆత్మాహుతి కారణంగా కేంద్ర ప్రభుత్వ వైఖరిలో మార్పు వచ్చింది. ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయంలో సమగ్ర నివేదికను సమర్పించటం కోసం జస్టిస్ వాంఛూను కేంద్ర ప్రభుత్వం నియమించింది. క్రీ.శ. 1953 అక్టోబరు 1 వ తేదీన కర్నూలు రాజధానిగా, ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు ముఖ్యమంత్రిగా ఆంధ్రరాష్ట్రం అవతరించింది.

భాషా ప్రాతిపదికపై రాష్ట్రాలను పునర్విభజించాలన్న సమస్యను కూలంకషంగా పరిశీలించి, నివేదికను సమర్పించటం కోసం ఫజుల్ ఆలీ అధ్యక్షతలో ఒక సంఘాన్ని కేంద్ర ప్రభుత్వం నియమించింది. ఈ సంఘం తన నివేదికను క్రీ. శ. 1955 లో సమర్పించింది. కేంద్ర ప్రభుత్వం ఈ నివేదికను అంగీకరించి, రాష్ట్రాలను భాషా ప్రాతిపదికపై పునర్విభజించటానికి తగిన చర్య తీసికొంది. తత్ఫలితంగా నేటి వివిధ రాష్ట్రాలు 1956 నవంబరు 1 వ తేదీన రూపొందింప బడినాయి. నిజాము పరిపాలన అంతమై తెలంగాణా కూడా చేరిపోవటంతో ఆంధ్రరాష్ట్రం, 'ఆంధ్రప్రదేశ్' అయి, హైదరాబాదు రాజధానీ నగరం అయింది. ఈ విధంగా నిరంతర సంఘర్షణవల్ల, త్యాగాలవల్ల 3½ కోట్ల ఆంధ్రులు స్వరాష్ట్రాన్ని పొందగలిగారు.

## మహిళాలోకం :

శ్రీ కందుకూరి వీరేశలింగంగారు స్త్రీ జనోద్ధరణకు అశేషంగా చేసిన కృషికి ఫలితంగా ఈనాడు స్త్రీలు అనేక రంగాలలో ప్రముఖ పాత్రను వహిస్తున్నారు.

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న యోధురాలే కాక స్త్రీలకోసమై ఎన్నో విద్యా సంస్థలను నెలకొల్పింది. ఆంధ్ర మహిళా సభను మద్రాసులోనూ, హైదరాబాదులోనూ స్థాపించి స్త్రీలకు ఎన్నో వృత్తి విద్యలలో శిక్షణ నిచ్చే సంస్థగా రూపొందించింది. శ్రీ కేసరిగారు స్థాపించిన "గృహలక్ష్మి" పత్రిక ఎంతోమంది రచయిత్రులను ప్రోత్సహించింది. ఈనాడు రాష్ట్రంలో ఖ్యాతి నార్జించిన రచయిత్రు లెందరో ఉన్నారు. లత, మునిపల్లె రంగనాయకమ్మ, యద్దనపూడి సులోచనారాణి, అరికెపూడి కౌసల్యాదేవి మొదలైనవారు నవలా రంగంలో సిద్ధహస్తులైనవారు. విద్యారంగంలో డాక్టర్ శ్రీదేవి చాలా కృషి చేశారు. రాజకీయాల్లో శ్రీమతి అమ్మన్నరాజా ప్రముఖ పాత్రను వహించారు.

## సాహిత్యం :

ఇప్పుడింక బహుముఖమైన ఆంధ్ర సంస్కృతిని పరిశీలించుదాము. ముందుగా 'సాహిత్యం' తో ఆరంభిస్తాను.

ఇంతకుముందే పేర్కొన్నట్లుగా తూర్పు చాళుక్య రాజు అగు రాజరాజ నరేంద్రుని ఆస్థాన కవి అయిన నన్నయభట్టు క్రీ.శ. 11 వ శతాబ్దిలో అనువదించిన ఆంధ్ర మహాభారతమే మనకు లభించిన తొలి తెలుగు మహాకావ్యం. ఈ ఆంధ్ర మహాభారతం ప్రౌఢరచన కాబట్టి అంతకుముందుకూడా కొన్ని కావ్యాలు రచింప బడి ఉండాలి ; కాని, దురదృష్టవశాత్తు అవి అలభ్యాలైనాయి. నన్నయ కవిత్వంలో సంస్కృత పదాల పాలు అధికం ; అయినప్పటికీ అది మనోహరమైన సరళ రచన. తన రచనను గూర్చి నన్నయభట్టు క్రింది విధంగా చెప్పుకొన్నాడు :

"సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థయుక్తిలో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు దెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్."

—ఆది పర్వ. ప్ర. ఆ. 25 ప.

నన్నయ మహాభారతంలో ఆది-సభా పర్వాలను, అరణ్య పర్వంలో కొంత భాగాన్ని అనువదించాడు. క్రీ.శ. 13 వ శతాబ్దిలో నివసించిన మరియొక తెలుగు మహాకవి తిక్కన మహాభారతాంధ్రీ కరణ భారం వహించాడు. తిక్కన మహాకవియే కాక మహాసేనాపతి అని కూడా ప్రసిద్ధి. ఆవేశ కారకాలు, ఆకర్షణీయాలు అయిన కొన్ని పట్టాలలో తిక్కన కవిత్వం కవితాంశంలోను, నాటకీయ రచనా పద్ధతిలోను

వ్యాసుని సంస్కృత భారతాన్ని సులువుగా మించుతుంది. ఈ తిక్కన 'కవిబ్రహ్మ' బిరుదాంచితుడు. క్రీ.శ. 14 వ శతాబ్దిలో నివసించిన ఎఱ్ఱా ప్రెగ్గడ, నన్నయ తిక్కనలు వదలివేసిన భారతారణ్య శేషభాగాన్ని, హరి వంశాన్ని అనువదించి, ఆంధ్ర మహాభారతాన్ని సంపూర్ణం చేశాడు. ఈ ముగ్గురు ఆంధ్ర మహాభారత కర్తలను 'కవిత్రయము' అంటారు. ఈ ఆంధ్ర మహాభారతం తెలుగులో తొలి కావ్యమే కాక తెలుగు భాషాసారస్వతాల విషయంలో ప్రామాణికమైన కావ్యం కూడాను.

క్రీ.శ. 15 వ శతాబ్దిలో శ్రీనాథ, పోతనలు అవతరించటంతో తెలుగు సాహిత్యంలో ఒక క్రొత్తయుగం ఆరంభమైంది. శ్రీనాథుడు నిజానికి 'విశ్వకవి.' అంతేకాదు, పాలకులైన రాజులతోపాటు జీవిత భోగభాగ్యాలను పూర్ణంగా అనుభవించాడు ; భౌతిక విషయాలలో బాగా నిమగ్నుడైనాడు. జీవితావసాన సమయంలో శ్రీనాథుడు చెప్పిన క్రింది పద్యం గమనింపదగినది :

"కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి,
రత్నాంబరంబు లే రాయఁడిచ్చు?
కంభఁగూడెఁ దెనుంగు రాయరాహుత్తుండు,
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు?
స్వర్గస్థుఁడయ్యె విస్సనమంత్రి మఱిహేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁగలదు?
కైలాసగిరిఁ బండె మైలారు విభుఁడేగి,
దినవెచ్చ మేరాజు తీర్పఁగలఁడు?
భాస్కరుఁడు మున్నె దేవుని పాలికరిగెఁ,
గలియుగంబున నిఁకనుండఁ గష్ట మనుచు
దివిజ కవివరు గుండియల్ దిగ్గురనఁగ,
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి."

సంస్కృతభాషపై బాగా అధికాధికారం కలవాడు శ్రీనాథుడు. అతడు హర్షనైషధాన్ని 'శృంగార నైషధము' అన్న పేరుతో ప్రౌఢంగా ఆంధ్రీకరించాడు. ఆనాటి సామాన్యుల జీవితసంప్రదాయాలను చిత్రీకరించిన 'క్రీడాభిరామం' అనే కావ్యాన్ని కూడా శ్రీనాథుడే రచించాడని కొందరు విమర్శకులు అభిప్రాయపడుతున్నారు.

రాజులను రాజాస్థానాలను, భోగాలను భాగ్యాలను దూషించి తిరస్కరించిన పోతన శ్రీనాథునకు పూర్తిగా విరుద్ధం. పోతన భాగవతాన్ని ఆంధ్రీకరించాడు.

ఆయన అనువాదం పద్యానికి పద్యంగా సాగలేదు; అనువాదం మూలంకంటె అధికమైంది. పోతన భక్త్యావేశం సాటిలేనిది. ఆయన శైలి ధారాళంగా, శ్రావ్యంగా, లయానుగుణంగా ఉంటుంది. పోతన పద్యాలు తెలుగు ప్రజలకు చాలా ప్రీతిపాత్రాలైనాయి.

ఏమ్మట శ్రీకృష్ణదేవరాయల యుగం ఆరంభమైంది. ప్రబంధ రూపం దాల్చిన తెలుగు సాహిత్యానికి అది స్వర్ణయుగం. తెలుగు భాషయందు తనకు గల గాఢాభిమానాన్ని, ఆ భాషా వైశిష్ట్యాన్ని శ్రీకృష్ణదేవరాయలు క్రింది విధంగా చాటి చెప్పినాడు :

"తెలుఁ గదేల యన్న దేశంబు దెలుఁ, గేను
దెలుఁగు వల్లభుండఁ, దెలుఁగొ కండ,
యెల్ల నృపులు గొలువ నెఱుఁగవే బాసాడి
దేశ భాషలందుఁ దెలుఁగు లెస్స."

— ఆముక్తమాల్యద, 1–15

ఇంతకుముందు చారిత్రక విభాగంలో పేర్కొన్నట్లుగా ప్రసిద్ధ విజయనగర కవులు ఎనమండుగురు. వారు పురాణానువాదాలతో తృప్తిచెందక, రచనా స్వాతంత్ర్యం పొందారు. రామరాజభూషణుని మాటలలో ప్రబంధ కవుల రచనా విధానం క్రింది విధంగా స్పష్టమవుతోంది :

"కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరిఁ బుట్టు రత్నము లవారిత సత్కవి కల్పనా విభూ
షావహ పూర్వవృత్తములు సానలఁ దీరిన జాతిరత్నముల్
గావున నిట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్."

—వసుచరిత్ర, 1–19

'మనుచరిత్ర' రచించిన అల్లసాని పెద్దన ఈ ఎనమండుగురిలోను సుప్రసిద్ధుడు; అంతేకాదు పెద్దన 'ఆంధ్ర కవితా పితామహ' బిరుదాంచితుడు. ఈ కావ్యం వైశాల్యంలో పెద్ద దైనప్పటికీ ఆసాంతం మనోహరంగా ఉంటుంది. మనుచరిత్ర రచన ఉదాత్తమై, భాష సంస్కృత పదబహుళము, శ్రావ్యము, లయాన్వితమునై అలరారుతూ ఉంటుంది. తెలుగు భాషలో ఇది ఒక ప్రామాణికమైన రచన. శ్రీకృష్ణదేవరాయలు ఈ మహాకవిని "ఎదురైనచోఁ దన మద కరీంద్రము నిల్పి, కేలూత యొసఁగి యెక్కించు" కొనే వాడట !

శ్రీకృష్ణదేవరాయలు స్వయంగా కవి; 'ఆముక్త మాల్యద' అనే ప్రౌఢ కావ్యాన్ని రచించాడు. ఈ కావ్య రచనాశైలి జటిలమై, నారికేళపాకంలో ఉంటుంది. ముక్కుతిమ్మన, ధూర్జటి, తెనాలి రామకృష్ణుడు మున్నగు మహాకవులంతా ఈ యుగానికి చెందినవారే. క్రీ.శ. 16 వ శతాబ్ది రెండవ భాగానికి చెందిన పింగళి సూరన 'కళాపూర్ణోదయము' అనే ఉత్తమ కావ్యం రచించాడు; దీన్ని 'కావ్య రూపంలో ఉన్న నవల' అంటే అతిశయోక్తికాదు. అంతేకాదు, ఇది కేవలం కల్పిత కథ కూడాను. అపూర్వమైన విధంగా సంగీత సాహిత్యాలు మేళవించిన రామరాజ భూషణుని 'వసుచరిత్ర' ఆనాటి మరియొక ఉత్తమ కావ్యం. ఆలంకారిక పదప్రయోగానికి, భావనా వైశిష్ట్యానికి, వ్యంగ్య సంపదకు, శ్లేష మాధుర్యానికి ప్రత్యేకత వహించిన వసుచరిత్ర తెలుగులోని పంచ కావ్యాలలో విశిష్ట స్థానం సంపాదించుకొంది.

విజయనగర సామ్రాజ్య పతనానంతరం కొందరు తెలుగు కవులు దక్షిణ దేశానికి తరలివెళ్ళి తంజావూరు, మధుర మొదలగు ప్రాంతాలలో స్థిరపడ్డారు. అచ్చట, తెలుగు సాహిత్యంలో వారొక క్రొత్త సంప్రదాయాన్ని నెలకొల్పారు. సారంగు తమ్మయ్య రచించిన 'వైజయంతీ విలాసము,' చేమకూర వేంకటకవి రచించిన 'విజయ విలాసము' తెలుగులో సుప్రసిద్ధాలైన కావ్యాలు. "ప్రతి పద్యము నందుఁ జమత్కృతి గలుగం జెప్ప నేర్తు"నని చెప్పుకొన్నవాడు చేమకూర వేంకటకవి. క్రీ.శ. 18 వ శతాబ్దిలో పలువురు కవులు రచనలు చేసినప్పటికీ చెప్పుకోదగిన గొప్ప కావ్యాలేమీ వెలువడలేదు. కవుల రచనలలో స్వాతంత్ర్యంకాని, శైలిలో రమ్యత కాని కన్పట్టదు. క్షీణదశ ప్రారంభమైనదని చెప్పవచ్చు.

తెలుగు వాఙ్మయ శాఖలలో చెప్పుకోదగిన విశిష్టమైన శాఖ 'శతక' వాఙ్మయం. భక్తి, నీతి, వేదాంతం, విమర్శ—అనే అంశాలు శతక రచనకు ప్రేరేపకాలు. క్రీ.శ. 17 వ శతాబ్దిలో నివసించిన వేమన శతక కవులలో సుప్రసిద్ధుడు.

క్రీ.శ. 15 వ శతాబ్దిలో నివసించిన అన్నమాచార్యులు వేంకటేశ్వరస్వామి భక్తులలో అగ్రేసరుడు. అన్నమాచార్యులు తెలుగులో రచించిన 'వేంకటేశ్వర వచనాలు' సుప్రసిద్ధాలైనాయి. కీ.శ. 18 వ శతాబ్దిలో నివసించిన క్షేత్రయ్య సుప్రసిద్ధుడైన పదకర్త. క్షేత్రయ్య పదాలు దాక్షిణాత్య నృత్యానికి నికషోపలాలు. క్రీ.శ. 18 వ శతాబ్ది తొలి భాగంలో నివసించిన త్యాగరాజు కర్ణాటక సంగీత సంప్రదాయానుసారంగా తెలుగు భాషలో రమ్యమైన కృతులు రచించిన సుప్రసిద్ధ వాగ్గేయకారుడు. "నిధి చాల సుఖమా? రాముని సన్నిధి సేవ సుఖమా? నిజముగ బల్కు

